బాలానంద

# కోటప్పకొండ చరిత్ర





నాగశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ ............................ విజయవాడ-2

ప్రథమ ముద్రణ
1986

ముఖచిత్రం:
వి. యస్. ప్రకాష్

ప్రచురణ :
నవరత్నా బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ-2

ముద్రణ :
"వెంకటరత్నా"
విజయవాడ-2

వెల : రు. 10-00

# విషయసూచిక

# కోటప్పకొండ చరిత్ర

## త్రికూటాచల ప్రభావము

## కోటప్పకొండ కథ

కోటప్పకొండ ఒక గొప్ప శివక్షేత్రం. ఆంధ్రప్రదేశ మండలి గుంటూరు మండలానికి చెందిన తాలూకా నరసరావుపేట నగరానికిదక్షిణంగా యేడుమైళ్ళ దూరాన నున్నది. 1587 అడుగుల యెత్తున 1500 యకరముల విస్తీర్ణం కలిగి ఆరుమైళ్ళ పొడవు వ్యాపించియున్న యీ కొండ చుట్టుకొలత జనవాడుకలో మాత్రం "అడుగుతక్కువామడ" అనే ముద్రవేసుకుంది. కొండమీద నున్న యల్లమంద కోటేశ్వరాలయం నేలమట్టానికి 600 అడుగుల యెత్తు నందున్నది. దీనికింకా పైభాగంలో ప్రాతకోటప్పగుడి గూడా కనిపిస్తుంది. క్రొత్త కోటప్పస్వామిని దర్శించిన వారంతా పోకపోయినా కొందరు యాత్రికులు మాత్రమక్కడదాకా పోయివస్తుంటారు.

కొండమీద నీటిదొన లెన్నున్నను యెనిమిది మాత్రమే లెక్కకు వచ్చినవి. స్వామిగుడికెదురుగా నున్న పెద్దదొనలోనే యాత్రికులు స్నానాదు లెక్కువగా చేస్తుంటారు. ఇప్పుడందరు దర్శించే స్వామివారి కోవెల నుండి ప్రాతగుడికి పోయే దారిలో నున్నది పెద్దడుగుదొన. పూర్వామీ దొనదగ్గరనే బసవేశ్వరుడు తపస్సు చేసినట్లు మనవారు చెబుతున్నారు. ఈ కొండ మీద యింకను "ఉబ్బు లింగం దొన. పుత్రచేతి దొనలేగాక మఱికొన్ని దొన లున్నట్లు చెప్పబడుచున్నవి.

ఈ కోటప్పకొండ కసలుపేరు త్రికూటాచలం. త్రికూటాచలమనగా మూడు శిఖరాలు గల కొండయని అర్థం. వానినే బ్రహ్మశిఖరం, విష్ణుశిఖరం, రుద్రశిఖరం అని చెప్పబడుచున్నవి. అందుచేతనే యీ కొండకు త్రికూటాచలమని, యిక్కడ వేంచేసి యున్న స్వామికి త్రికూటేశ్వరుడని యిచ్చటి చరిత్రకు త్రికూటాచల మహాత్మ్యమనియు పేర్లు కలిగినై. ఈ కొండ నెటు నుండి చూచినా మూడు కోటులు కనబడుచుండుటొక విశేషమనక తప్పదు.

రుద్రశిఖరం మీద ప్రాతకోటేశ్వరాలయ మున్నది. విష్ణుశిఖరం మీద పాపనాశన స్వామి కోవెల యున్నది. బ్రహ్మశిఖరంమీద నేటి వైభవములు పొందుతున్న క్రొత్త కోటేశ్వరస్వామి వేంచేసి యున్నాడు. ఇచటి క్షేత్ర పాలకుడును కోటేశ్వరస్వామియే. కొండకు దగ్గరలో యల్లమంద యను గ్రామమున్నది. పరిసరములందలి గ్రామములకన్న నింకను దగ్గరగనున్న కారణముననో, అప్పటికది వైభవముగ నున్నందుననో యాత్రికులీస్వామికి యల్లమందకోటేశ్వరుడని పేరు పెట్టారు. ఆపేరు యీనాటికి నిలిచిపోయింది. వెలనాటి గొంకరాజు మొదలగు వారి శిలా శాసనము లాధారముగ యీ కోటప్పకొండ రమారమి క్రీస్తుశకం వెయ్యిసంవత్సరాల ప్రాంతంనుండి ప్రచారమున నున్నటులు తెలియుచున్నది.

విజయనగరం పాలించిన ప్రభువులలో శ్రీకృష్ణదేవరాయలు చాలగొప్పవాడు. ఆయన యెన్నో దేవాలయాలు కట్టించాడు. కట్టియున్న దేవాలయాల కొన్నింటిని మరమ్మత్తులు చేయించాడు. కొన్ని దేవాలయాలకు నూతన కట్టడములను నిర్మించాడు. దేవాలయాలనెన్నింటికో మాన్యములు, అగ్రహారములు, వాహనాదులనిచ్చాడు. ఆయనగారి ఆనతి ప్రకారంబుగ విజయ

నగర మహామంత్రులైన తిమ్మరుసుగారు యిచటి త్రికోటీశ్వరస్వామికి వైభవములు జరుగుటకుగాను నమస్కరించి కొండకావూరును అగ్రహారంగ సమర్పించినట్లు శాసనాల మీద వ్రాయబడింది. అకారణంగా యల్లమంద కోటయ్యను రావూరి "త్రికోటేశ్వర శ్రీమహాదేవ" అని చెప్పుటయుకలదు.

ఈ త్రికోటేశ్వరాలయానికి పోవు మెట్లదారి లోనే గొల్లభామ గుడి యున్నది. యాత్రికులిచటకొంత సేపాగి కానుకలర్పించిన తరువాత స్వామిని దర్శింప పైకిబోవుటాచారం. గొల్లభామ గుడి దగ్గర వెనుకటినుండి యాదవులే పూజారులుగా వుంటున్నారు. గొల్లభామనుగురించిన కథ యొకటున్నది. ఆమె కోటయ్యస్వాముల వారి భక్తురాలు.

ప్రధానాలయానికి దక్షిణ భాగంలో గణనాథస్వామి యున్నాడు. పడమర భాగంలోను; ఉత్తర భాగంతోను సాలంకేశ్వరలింగం; సంతాన కోటేశ్వరస్వామి లింగములున్నవి. ఎడమ ప్రక్కనున్న దొన దగ్గరనే మార్కండేయస్వామి లింగమున్నది. దిగువమెట్ల దారి సమీపంలో రామలింగేశ్వర లింగము, బొచ్చుకోటయ్య గుడులున్నవి. బొచ్చు కోటయ్య గుడి దగ్గర మ్రొక్కుబడులున్న వారు తలనీలా లిచ్చుచుందురు. కొండ క్రిందిభాగంలో నీలకంఠేశ్వరస్వామి; ప్రసన్నకోటేశ్వరు లున్నారు. ఈ క్షేత్రము నందింకను కొన్ని దేవాలయములున్నవి.

## త్రికూటాచలములు

కోటప్పకొండ మూడు శిఖరములతో గూడి యున్నందున దీనిని త్రికూటాచలమన్నారు. ఐతే భారతదేశంలో త్రికూటాచల మనే పేరుగల

కొండలు మఱికొన్ని యున్నవి. అందొకటి రాజపుటానా యందలి అజ్మీరు నకు ఏడుమైళ్ల దూరంతో "పుష్కరక్షేత్ర" మను నామమును చెప్పబడు తూంది. ఆకొండకు గల మూడు చోటులను గాయత్రి, సావిత్రి, సరస్వతీ శిఖరములని చెప్పుచున్నారు. భాగవతము నందున్న ప్రముఖ ఘట్టములలో నొకటి యగు గజేంద్రమోక్షమునకు సంబంధించిన స్థలమిదియే నను పురాణ ప్రసిద్ధియు కలదు.

అటులనే తిరునల్వేలి జిల్లాలోని తెన్‌గాన్ స్టేషనుకు మూడు మైళ్ళ దూరమున తిరుకుత్తాలము దగ్గరొక త్రికూటాచల మున్నది. ఆ కొండమీద తిరుకుత్తాలేశ్వరాలయ మున్నందున నచటి క్షేత్రపాలకుడు తిరుకుత్తాలేశ్వర స్వామి యని తెలియచున్నది. ఇంకనూ అచట రాజరాజేశ్వరీ దేవాలయం; అగస్త్యాశ్రమం మొదలైన పుణ్యస్థలాలతో బాటు మంచి సెలయేరులుగూడా గలవు.

మనమిప్పుడు చెప్పుకునేది గుంటూరు మండలంలోని త్రికూటాలమను కోటప్పకొండ గాని యింకొకటి కాదు. ఈచరిత్రను గురించి శ్రీ మద్దిలపల్లి గురుబ్రహ్మ కవిగారు పూర్తివివరములతో వచన గ్రంథం వ్రాసియున్నారు. అటులనే కీ. శే. బ్రహ్మం కొప్పరాజు నరసింహకవిగారు. "శ్రీమత్త్రి కూటాచలమాహాత్మ్య" మను ప్రబంధమును మూడాశ్వాసములతో వ్రాసి యున్నారు. మఱియు శ్రీ రూపెనగుంట సీతారామయ్య గారు క్రీ. శ.1905వ సంవత్సరమున కొండయొద్ద జరుగు తిరునాలల గురించి రగడతో వ్రాసి యున్నారు. ఇంకను విద్వాన్ భాగవతుల వెంకటసుబ్బారావు ప్రధానాంధ్రా ధ్యాపకులు గూడ శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యమను పేరనే మూడాశ్వాస

ముల ప్రబంధముగ వ్రాసియున్నారు. ఇవిగాక పాటలతోను, పద్యముల లోను, గద్యములలోను చాలమంది వ్రాసిన గ్రంథములున్నవి.

మాఘమాస మంతయు యిచట స్వాములవారికి పూజలు అఖండ దీపా రాధనలు జరుగుచున్నవి. ప్రతి సంవత్సరం మహాశివరాత్రి పుణ్యకాలంలో యిచట గొప్ప తిరునాల జరుగుతూంది. దూర ప్రాంతాల నుండి కూడ యాత్రికు లాసమయంబున స్వామిని దర్శింప వస్తున్నారు. పూర్వ మీ క్షేత్రమున కాపురపిండ్లు లేక బీడువలె నుండెడిది. సమీపము నందలి పల్లెలకు చెందిన వారిక్కడ పశువులను మేపుకొనుచుండెడివారు. నేలంతా పల్లేరు కాయలతో నిండివుంటుంది. తిరునాల రోజులలో మాత్రమిక్కడ అంగడులు బారులుదీరి వెలిసేవి. అన్నసత్రాలుండేవి. రంగురంగుబొమ్మలతో, కరెంటు దీపములతో, రంగుకాగితపు పనిదనాలతో నలంకరించిన పెద్ద పెద్ద ప్రభలు మిక్కుటంగా వస్తున్నవి. ఈమధ్య కాలంలో కొన్ని భవనాలేర్పడినై. తొలి యేకాదశి యనబడే ఆశ్వయుజ శుద్ధయేకాదశిల నాడుగూడ యీ కోటప్ప కొండ దగ్గర కొన్ని యుత్సవాలు జరుగుచున్నవి.

తరువాత తరువాత అన్ని కులాలవారును యిచట అన్నసత్రాలు పెడుతున్నారు. అవిగాక హోటళ్ళుగూడ నడుపుతున్నారు. చెక్క భజనలు, రంగులరాట్నాలు, నృత్యాలు, పాటలు, హరికథలు, ప్రభలూరేగింపులు, సంతలు మొదలైన వానితో మహాశివరాత్రి నాడీక్షేత్రం క్రిక్కిరిసిన జన సమూహాలతో కోలాహలంగా వుంటుంది.

# సాలంకయ్య సోదరులు

గుంటూరు మండలంలో యల్లమంద అనే గ్రామమున్నది. ఆ గ్రామం లోనే లింగబలిజి కులానికి చెందిన కోరె సాలంకయ్య వున్నాడు. సాలంకయ్య కలపవ్యాపారి. ఆయనకు ఘట్టయ్య,మలికార్జునుడు, బసవశంకరయ్య, యీశ్వరయ్యలనే తమ్ములు కూడా నలుగురున్నారు. అన్నదమ్ములంతా విదేశవ్యాపారం చేసేవారే. అడవులలో తిరిగి చెట్లుకొట్టించి కలప సేకరించడానికి పనివారల వెంటబెట్టుకొని అక్కడక్కడా గుడారాలు వేసి తాత్కాలిక నివాసాలు చేయడం వారి కలవాటు. అడవులలో సంచరించే పులులు చిరుతలు, ఎలుగులు మొదలగు భయంకర జంతువులచే ప్రాణభయం కలుగని రక్షణమార్గాలు వారి కున్నవి. వారంతా పేరు గాంచిన పెద్దవేటగాండ్రు.

ఒకనాడు వారిచెంతకో మునివచ్చాడు. వచ్చిన సాధుమూర్తి ముఖారవిందం, రుద్రాక్షమాలలు, కాషాయాంబరాలు, దండ కమండలాలు వారినాకర్షించినై, కైలాసంనుండి అపర సాంబశివుడే దిగివచ్చాడా అనిపించింది కూడాను. అన్నదమ్ము లైదుగురు నా వచ్చిన యోగిని గౌరవించారు. సకలోపచారాలు చేసిన తరువాత వినయంగ "స్వామి! మీపేరేమి? ఊరేమి? తమ తల్లిదండ్రులెవ్వరు? బంధువులెందున్నారు." అని అడిగారు. ఆమాటల కాబాటసారి చిరునవ్వు నవ్వుతూ "నాయనలారా! సత్యము నాతల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము సోదరుడు, దయ చుట్టము, శాంతము సహధర్మచారిణి, క్షమ కుమారుడు. మెడలో మెదలాడుచున్న నాలింగమే నాకు దైవము. శివపంచాక్షరీమంత్రం నిత్యోపాసన దీక్ష, ప్రపంచమంతా నానివాసమే.

నా పేరు మాత్రం కోటేశ్వరుడంటుంటారు. ఇంకా మీకేం కావాలో అడగండి. చెప్తా" నన్నాడు.

అన్నదమ్ములా మాటల సర్థం చేసుకున్నారు. చేతులు జోడించి "మహానుభావా! ఇంతకన్న మీరేమీ చెప్పనవసరం లేదు. మీరింకమీద మమ్ములను విడనాడి యెక్కడకూ పోవలదు. మీకు కావలసిన వాని నన్నింటిని మీకు తెచ్చి యిచ్చుకుంటుంటాము. మామాట కాదనక మా గుడారము నందే మీరింక నివసించండి. మేమంతా మీశిష్యులం. మీరు చెప్పినట్లు నడచుకుంటామని ప్రాధేయ పడ్డారు. ఆగంతకుల వారు సరే నని ఆమోదించారు. సాలంకయ్య వారి మజిలీ మార్చినప్పుడు స్వాములవారిని వెంటబెట్టుకొని పోయి ముందుగా వారి కన్ని యేర్పాటులు గావించి గౌరవిస్తున్నారు. స్వాములవారికి గూడా సాలంకయ్యన్నా, సాలంకయ్య సోదరులన్నా వాత్సల్యం పెరిగిపోయింది.

మనదేశమొక్కప్పుడు దండకారణ్యమని చెప్పుకుంటున్నాం. ఆ కాలంలో కోటప్పకొండ చుట్టూ అడవి పెరిగి యున్నదేమో సాలంకయ్య యొకప్పు డీ ప్రాంతంలో పర్యటించడం జరిగింది. ఆకారణంగా వ్యాపారు లీకొండ క్రింద గుడారముల వేయించి వంటలు సేయ పనివారిని నియమించారు. స్వాములవారంతట "నేనీ కొండమీదకు పోయి చూచివచ్చెద"నని చెప్పి రుద్రశిఖర మెక్కాడు. ఆ పరిసర ప్రాంతంలోని కోనేరులు, మారేడు చెట్లు, పూలవనాలాయన నాకట్టుకొన్నవి. అంతేకాకుండా దైవాంశగల ఋషులు కూడా కనపడి నందున వారక్కడనే నిలిచిపోయారు. స్వాముల వారెంత సేపటికీ తిరిగిరాని కారణమున సాలంకయ్య తమ్ములను వెంట

బెట్టుకొని కొండెక్కి పోయి మునీంద్రుని క్రిందికిదిగి రావలసినదిగా వేడుకున్నారు. ఆమహనీయు డందుల కంగీకరింపక "బిడ్డలారా! నాకిక్కడా నివాసయోగ్యముగ నున్నది. నేనిక్కడనే నిలిచిపోవాలను కున్నాను. నేను మీవెంట రాలేదని మీరుబాధపడకండి" అన్నారు.

సాలంకయ్య గారికా సాధువు మీద భక్తివిశ్వాసాలు కుదిరాయి కనుక ఆయనను విడిచి వెళ్ళలేక పోయాడు. అందుకని వారుకూడ స్వాములవారిని దగ్గరలోనే ఉండాలని వారి గుడారాలను కొండమీదికి తరలించారు. వారి కపుడాచోటొక నివాసస్థానమయింది. సాలంకయ్య సోదరులు వ్యాపారము యెక్కడెక్కడ చేసివచ్చినా తిరిగి స్వాములవారిని దర్శించుకుంటున్నారు. ఆయనగారి వలన అనేక విషయాలు తెలుసుకుంటున్నారు. ప్రతిరోజు వారికా మహనీయుని ప్రేమాశీస్సులు లభించుచున్నవి. వ్యాపారానికి సంబంధించిన వారంతా యిప్పుడా స్వాములవారి భక్తులుగా గుర్తింపబడ్డారు.

అలాగా మరికొన్ని రోజులు గడిచిపోయినై.

## శివలింగముల చిద్విలాసములు

ఒకనాడు సాలంకయ్య తన తమ్ములను, పరివారాన్ని వెంటబెట్టుకొని పోయి "స్వామీ! మీరు కేవలం దైవాంశ సంభూతులేకాని మానవమాత్రులు కారు. మేమేనాడో చేసికొనిన పుణ్యం కొలది యీనాడు మీకింత దగ్గరవారమయ్యాం. ప్రతిరోజు మిమ్ము దర్శించి; సేవించి; మీ దీవెనలందుకునే భాగ్యం కూడ మాకు లభించింది. అంతే కాకుండా మీరు మాకు

మార్గదర్శకులయ్యారు. మీవలన ఎన్నో వేదాంతరహస్యాలు, పరమేశ్వర లీలలు, మానవధర్మాలను కూడ తెలిసికొన్నాం గురుదేవా! మన భారత దేశ మంతటా లింగముల మయమై యున్నది. ఇంకా నిజం చెప్పవలయు నంటె ఉత్తరభారతదేశంలో కన్నా దక్షిణభారతదేశంలో లింగము లెక్కు వగా కనబడుచున్నవి. అసలీ లింగములెన్ని? అందు ముఖ్యములైనవేవి? అవి యెక్కడెక్క నున్నవి? వాని పేరులేమి మొదలైన వివరములు చెప్పి మాకానందం కలిగించండి" అని వేడుకున్నారు.

ఆ మాట లాలకించిన స్వాములవారికి ఆనందం కలిగింది. "నాయన లారా! మీరు చాల మంచి విషయం అడిగారు. లింగలీలలను పరిపూర్ణంగ వివరించి చెప్పాలంటే పరమేశ్వరునికే తరంకాదు. ఐనను నేను పెద్దలవలన వినినంత వరకు మీకు చెప్పుదును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మువ్వురి లోను లింగరూపధారి శివుడు మాత్రమే. మిగిలిన వారికి లింగాకారము లంతగా లేవు. ప్రపంచము నందెచట లింగరూప మున్నది శివక్షేత్రమని చెప్పనవసర ముండదు.

అసలీ ప్రపంచమే గోళాకారమున నున్నది. గోళమనగ గ్రుడ్డు. అది లింగాకారమున నున్నది. తల్లికడుపులో బిడ్డ యేర్పడడానికి ముంది లాంటి యండములు రూపొందుతాయి. పక్షిజాతి ముందు తల్లికడుపునుండి యండముగనే బయటపడి తరువాత ఆగ్రుడ్డునుండి పిల్ల యేర్పడుతుంది. ఆ అండము లింగము వంటిది. ప్రళయకాలంలో ప్రపంచ మంతా లయమైన తరువాత జగత్తునంతా నిండియుండెడి సద్వస్తువను దానికి రూపంలేదు. నామం

లేదు. వికారమునులేదు. అట్టి నామ రూప క్రియలులేని ఆసద్వస్తువును గుర్తించుటకే బదులు లింగాకృతిని ఆదర్శంగా చూపుచున్నారు. అటు పిమ్మట యీరూపలింగమైన సద్వస్తువునకు సంకల్పం కలుగుతుంది. అప్పుడిక రూపకల్పన, క్రియాకల్పనలు, కలిగి విశ్వమంతా వ్యాపించుచున్నందున లింగప్రభావము యింతయని కొలిచిచెప్పగల వారెవ్వరును లేరు.

ఆ విషయంవేరు. అంతిగొప్ప భావంతో చూపబడే యీ లింగాలను గురించి మీకు నేను సవిస్తరంగా చెప్తాను వినండి." అన్నారు స్వాముల వారు.

## పన్రెండు శివ జ్యోతి లింగములు

మన దేశ మంతటా శివలింగాల మయం. వానిలో ప్రత్యేకమిది లెక్కించి చెప్పుకో దగిన శివక్షేత్రములు కొన్ని మాత్రమే. ఆ కొన్నింటి లోను పన్నెండింటిని ప్రత్యేకంగా"ద్వాదశ జ్యోతిర్లింగము" లంటారు. అవి సౌరాష్ట్రంలో సోమనాథ లింగం! శ్రీశైలంలో మల్లికార్జున లింగం: ఉజ్జయినిలో మహాకాళేశ్వరలింగం; సిహ్యాపర్వతం మీద ఢాకినీ శిఖరమందు భీమేశ్వరలింగం; వారణాశిలో (కాశి) విశ్వేశ్వరలింగం; నాసిక క్షేత్రంలో త్ర్యంబికేశ్వరలింగం; ఉత్తర హిందూదేశ మందలి బహిభూమిలో వైద్య నాథేశ్వరలింగం; దామకావనంలో నాగేశ్వరలింగం; రామేశ్వర మనంబడు ధనుష్కోటిలో రామలింగేశ్వరలింగం; ఎల్లోరాగుహలకు సమీపంబున ఘుశ్మేశ్వర లింగములనే నామములతోనే ప్రసిద్ధికెక్కాయి.

## సోమనాథ లింగము-1

సోమనాథలింగము సౌరాష్ట్రదేశమందలి ప్రభాసక్షేత్రము నందు ప్రకాశించు చున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిలింగములలోయిది మొదటిది. పంచమవేద మని చెప్పబడుచున్న మహాభారతములో దీని ప్రభావము నద్భుతముగా వర్ణింప బడియున్నది. పూర్వం దక్షప్రజాపతి తన కుమార్తెలలో అశ్విని, భరణి యనబడే యిరువదేడుగురు కుమార్తెలను చంద్రున కిచ్చి వివాహం చేశాడు. ఐతే ఆచంద్రుడు వారందరిలోను చిన్నదైన రేవతి యందే అనురాగం కలిగి మిగిలిన భార్యలను సరిగా చూడక పోయిన కారణంగా దక్షుడు కోపించి యతనికి క్షయవ్యాధి కలిగే లాగ శపించాడు. అంతట చింతించిన చంద్రుడిక్కడకు వచ్చి యీ లింగమునారాధించినందున వానికి మరల ప్రకాశం కలిగినట్లు యితిహాసం చెబుతూంది. చంద్రునికి సోముడనే పేరున్నది. సోమునిచే పూజింపబడిన యీలింగానికి సోమనాధ లింగమని పేరు వచ్చింది.

## మల్లికార్జున లింగము-2

మల్లికార్జునలింగము ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణానదీతీరాన శ్రీశైలం మీదనున్నది. శ్రీశైలాన్ని మహాఋషులు దక్షిణకాశి యని ప్రశంసించియున్నారు. పరమశివుని పన్నెండు జ్యోతిర్లింగములలో యిది రెండవది. శ్రీశైల మల్లికార్జున ప్రభావం శివపురాణములందేగాక మహాభారతమందునూ విశేషంగ చెప్పబడింది. దూరముననుండి శ్రీశైల శిఖరంచూచిన మాత్రాననే పునర్జన్మ యుండదని యితిహాసములు తెలుపుచున్నవి. పూర్వ మొక భక్తురా

రిచట లింగమును తెల్లని మల్లెపూలతో పూజించినందున శ్రీశైలస్వామికి మల్లికార్జున లింగమని పేరు వచ్చింది.

## మహాకాళేశ్వరలింగము-3

మహాకాళేశ్వర లింగము ఉజ్జయిని నగరమందున్నది. ఉజ్జయినికి మారుపేరు అవంతీ పట్టణము. పూర్వం ఉజ్జయినిని పాలించిన ప్రభువులలో భట్టి విక్రమార్కుని గురించి కథలు చెప్పుకుంటున్నాం. పరమశివుని పన్నెండు జ్యోతిర్లింగములలో యిది మూడవది. మన భారతదేశంలో అయోధ్య; మధుర; మాయాపురి; కాశి; కాంచి; అవంతి; ద్వారవతు లనునేడు సప్తపురములని పేరుగాంచినవి. స్కాంధ పురాణంలోనూ యీ యవంతిని గురించి ప్రత్యేకభాగంగ పేర్కొనబడింది. ద్వాపరయుగంలో సాందీపని ముని యిక్కడ నివసించినందున బలరామకృష్ణులీ యవంతి యందే చదువు కొనినట్లు పురాణం చెబుతూంది.

చదువంతా పూర్తిఅయ్యాక బలరామకృష్ణులు గురువుగారికి గురుదక్షిణ యీయబోయారు. సాందీపకముని వారితో "నాకుమారుడు స్నానము సేయుచు నదిలో మునిగిపోయి యిప్పటికి కొన్ని యేండ్లు గడచినవి. ఐనా నాకా పుత్ర శోకం మరపురావడంలేదు. నాకుమారుని నాకు తెచ్చియిస్తే అదే మీనుండి నేను పుచ్చుకునే గురుసన్మాన మన్నాడు. అంతట బలరామకృష్ణులు సముద్ర గర్భంలోనికిపోయి విచారించి; అక్కడనుండి యమలోకంపోయి యముని గూడ బెదిరించి గురుకుమారుని వెంటబెట్టుకొని వచ్చి గురువుగారి కొప్పగించగా ఆ ముని సంతోషించి బలరామకృష్ణుల నాశీర్వదించినట్లు మన మొక పురాణగాథ వింటున్నాం.

## పరమేశ్వర లింగము-4

పరమేశ్వరలింగము మాలవప్రాంతమందలి నర్మదీతీరంలో ఓంకార క్షేత్రమునందున్నది. పరమేశ్వరుని పన్నెండు లింగములలో యిది నాల్గవది. ఇచటనే నర్మదానదినుండి కావేరిక యను పాయ చీలుతున్నది. ఈ రెండు ప్రవాహముల మధ్యనున్న కొండచుట్టు నేలకు శివపురి యనిపేరు. దీనినే మాంధాతపురి అనికూడ అంటారు. అది కొండప్రదేశం. అందున్న దేవళములనింటిలోను ఓంకారేశ్వరాలయము మిగుల ప్రసిద్ధిగాంచినది. ఈ ఓంకార క్షేత్రమునకు పోవుదారిలోనే రెండు చిన్న చిన్న కొండలున్నవి. వాటికి విష్ణుపురి యనిపేరు. గోపికలధార యీ విష్ణుపురితో పారుచున్నది. శివపురాణమున ఓంకారేశ్వరస్వామి శ్లాఘింపబడినాడు. సూర్యవంశపు రాజులలో ప్రఖ్యాతిగల మాంధవ చక్రవర్తి యిచటి మాంధాత పురమునకు ప్రభువు. ఆ రాజశేఖరుడు చాలకాలము తపస్సుచేసి పరమేశ్వర సాక్షాత్కారముపొందిన తరువాత ఓంకారమునందీ దేవాలయమును నిర్మించినట్లు యితిహాసములు చెప్పుచున్నవి.

## కేదారేశ్వర లింగము-5

కేదారేశ్వరలింగము హిమాలయ పర్వతముమీది కేదారశిఖరమునకు పడమరగ మందాకినీ నదీతీరము నందున్నది. పరమేశ్వరుని పన్నెండు జ్యోతిలింగములలో యిది ఐదవది. రుద్రప్రయాగ దగ్గర మందాకినినుండి చీలినపాయ కొంతదూరంపోయిన తరువాత దేవప్రయాగ దగ్గర భాగీరథితో సంగమించుచున్న అలకనందానదీ తీరమున బదరీ నారాయణస్వామి వేంచేసి

యున్నాడు. మందాకినీ తీరమందున్న కేదారేశ్వరుని దర్శింపకయే బదరీనాథ క్షేత్ర యాత్ర చేసినను అది యాత్రకాదని యాత్రికుల నమ్మకం. స్కాంద పురాణంలోని కేదారఖండమునందు కేదారస్వామి మహిమ గొప్పగ వర్ణింప బడింది. ఇది హృషీకేశానికి 132 మైళ్ళ దూరంలోను; హరిద్వారానికి 150 మైళ్ళ దూరంలోను కలియుచున్న కూడలియందున్నది. కేదారయాత్రకై బయలుదేరిన భక్తు లేకారణముననేని స్వామిని దర్శింపకయే దారిలోనే చని పోయిన యెడల వారికిని కైలాసము సిద్ధించుచున్నదని పురాణములు తెలుపు చున్నవి.

## భీమలింగేశ్వర లింగము-6

భీమలింగేశ్వర లింగము సహ్యాపర్వత మందలి ఢాకిని యను శిఖరము మీదనున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిర్లింగములలో యిది ఆరవది. భీమలింగేశ్వరుని సన్నిధి యందుదయించిన నదికి భీమానది యని పేరు వచ్చింది. ఢాకినీ శాకినీ సమూహాలతో భీమశంకరస్వామి భక్తిజన పాలనకై యిచట వేంచేసియున్నాడని యితిహాసములు తెలుపుచున్నవి. ఎందరో ఋషులు— భక్తులు స్వామి యనుగ్రహంబున వరములను పొందియున్నారు.

## విశ్వేశ్వర లింగము-7

విశ్వేశ్వరలింగము కాశినగరము నందున్నది. కాశీ విశ్వేశ్వరుని పేరు విననివారుండరు. కాశిపురానికి ఆనందకాననము— మహాస్మశానము— రుద్ర

నసము— కౌశిక— ముక్తిక్షేత్రము అనునవేగాక వారణాసి యనే నామమున్నది. వరణ— అసి (వారణాసి) నది ప్రవహించుచున్న క్షేత్రమయినందున యీ నగరం వారణాసి అయింది. పరమశివుని పన్నెండు జ్యోతిర్లింగములలో యిది ఏడవది. కాశీవిశ్వనాధుని దేవేదిపేరు అన్నపూర్ణాదేవి. కాశీ ఖండములోని అన్నపూర్ణ బిందు మాధవుడు, కాలభైరవుడు, కుమారస్వామి, మణికర్ణిక, గంగానదులు ప్రశస్తములైనవి. కాశీయాత్ర చేయు తాపత్రయం పొందిన భక్తులు యాత్ర చేయలేకపోయినను వారికి కాశీ యాత్ర చేసిన ఫలం దక్కుతుంది. ప్రళయకాలము సంభవైనను విశ్వనాధస్వామి యీ కాశీనగరమును తన త్రిశూలముమీద నెత్తికాపాడుననియు, కాశీక్షేత్రమునందు మరణించిన ప్రతిజీవి కుడిచెవిలో పరమేశ్వరుడే స్వయముగ తారకమంత్రోపదేశము చేయుననికూడా కాశీక్షేత్ర మాహాత్మ్యము వర్ణించుచున్నది.

## త్ర్యంబిక లింగము—8

త్ర్యంబికలింగము నాసికయందున్నది. పరమేశ్వరుని పన్నెండు జ్యోతిర్లింగములలో యిది యెనిమిదవది. త్రేతాయుగమున శ్రీరాముడు పర్ణశాల యందున్న సమయమున లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులుకోసిన చోటునే నాసిక క్షేత్రమని చెప్పుచున్నారు. తరువాత రామలక్ష్మణులు యింటిలోలేని అదనుచూచి రావణుడు సీతాదేవిని అపహరించుకొని పోయినదియు నిచటనే నని కొందరనుచున్నారు. ఈ పుణ్యస్థలం సహ్యాద్రి యందొన శిఖరమున నున్నది. ఇచటకు దగ్గరగ నున్న బ్రహ్మగిరిమీద గౌతమీ నది పుట్టి పారుచున్నది. బ్రహ్మగిరిమీదనే యాత్రికులు చూడదగిన రామ

కుండము, లక్ష్మణ కుండములు నున్నవి. గౌతమముని ప్రార్థించినందున భక్తజన శంకరుడైన శంకరు డచట త్ర్యంబికేశ్వరుడై వెలసి యున్నాడు. త్ర్యంబకేశ్వర దేవాలయంలో బ్రహ్మలింగము, విష్ణులింగము, మహేశ్వర లింగములు మూడున్నవి. గౌతమముని వలననె గౌతమీనది పుట్టినట్లు పురాణములు తెలుపుచున్నవి. అఖండ గౌతమీనదినే గోదావరి యనుచున్నాము.

గోదావరీనదీ తీరమందలి రాజమహేంద్రవరము చరిత్రగల పట్టణము. దానిని రాజనరేంద్రుడు పాలించాడు. వ్యాస మహాభారతమును తెలుగు సేవ జేసిన నన్నయభట్టు మరోకవి యీ రాజరాజనరేంద్రుని యాస్థాన పండితుడు ఇచటకు సమీపమునందే నాడు మార్కండేయునకు శంకరుడు సంపూర్ణాయువు నిచ్చిన క్షేత్రమున్నది. అటులనే కోటిఫలీ క్షేత్ర మీప్రాంతమున నున్నది. అఖండ గౌతమీ తీరమునందున్నవన్నియు దివ్యస్థలములే.

## వైద్యనాథ లింగము–9

వైద్యనాథలింగము ఉత్తరభారతావనిలోని చితాభూమి యను ప్రదేశము నందున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిలింగములలో యిది తొమ్మిదవది. వైద్యనాథలింగమును దర్శించినంతనే మానవులు జన్మ జన్మలలో చేసిన పాపములు హరించుచున్నవి. భక్తి విశ్వాసములు కలిగి యిచటి లింగము నారాధించిన వారికి యెటువంటి శారీరక, మానసిక వ్యాధులున్నను, తగ్గిపోయి పూర్ణారోగ్యము, పూర్ణాయువులను పొందుదురు కనుక యీ స్వామికి వైద్యనాథ లింగమను పేరు సార్థకమయింది.

## నాగేశ్వర లింగము-10

నాగేశ్వరలింగము దారుకా వనమందున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిలింగములలో యిది పదియవది. దారుకావనమున శంకరుండొక సమయంబున భిక్షకై రాగ నచటి మునిపత్నులందరును శివుని సుందరరూపం చూచి మోహించినట్లును— కృష్ణార్జునులు గత జన్మలందు నరనారాయణులై యిచట తపమాచరించినట్లును పురాణములు చెప్పుచున్నవి. ఈ దారుకా వనము గోమతీద్వారకకు సమీపము నందున్నది. ఇందు వేంచేసియున్న నాగేశ్వరలింగమును దర్శించి పూజించినవారికి సకల దోషములు హరించుట యందును; సకల సంపదలు కల్గుట యందును; సంతానభాగ్యము లభించుట యందును సందేహములేదని యితిహాసములు ఘోషించుచున్నవి.



## రామేశ్వర లింగము-11



రామేశ్వరలింగము సేతురామేశ్వరము నందున్నది. దక్షిణ సముద్ర తీరమునందున్న ధనుష్కోటియనియు చెప్పబడుచున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిలింగములలో యిది పదునొకండవది. ఇచటి వెండి రథము. నందీశ్వరుడు, గోపురము మొదలైన దృశ్యములు చూడదగినవి. ఇచట అమృతవాటిక, హనుమత్కుండము, రామతీర్థములు మిగుల పవిత్రములు. రాముడు లంకాపురము మీద దండెత్తినప్పుడు సముద్రము దాటు నుపాయము నాలోచించి రామ సైన్యమునకు సైన్యాధిపతియు, విశ్వకర్మ కుమారుడునగు

నీలాచార్యునిచే నిర్మింపబడిన సేతువు నేడు శిథిలావస్థ నొందియున్నను చూడదగినది. రాముడు తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకమును పోగొట్టుకొనుటకై శివ ప్రతిష్ఠచేసిన యీ రామలింగేశ్వర లింగమును గంగా జలముతో నభిషేకించి పూజించిన వారికి ముక్తి సిద్ధించునని మునీంద్రుల వాక్యము.

## ఘుశ్మేశ్వర లింగము-12

ఘుశ్మేశ్వరలింగము దక్షిణభారతావనిలోని ఎల్లోరా గుహలకు సమీపము నందున్నది. పరమశివుని పన్నెండు జ్యోతిలింగములలో యిది పన్నెండవది. ఇచటి కైలాస శిల్పకళ ప్రపంచ ఖ్యాతిగాంచినది. ఈ స్వామి నారాధించినవారికి శివసాయుజ్యము లభించునని మహాఋషులు తెలుపుచున్నారు.

ఈ ద్వాదశ జ్యోతిర్లింగములేగాక పార్థివలింగముగూడ ప్రభావం గలది. దాని చరిత్రయు పురాణ ప్రసిద్ధమై కీర్తింపబడుచున్నది.

## పార్థివ లింగ ప్రభావము

అది ప్రళయకాలం. ప్రళయంలో ప్రపంమీదనున్న జీవరాసులన్నీ అంతరించిపోతై. ఎటుచూచినా గాఢాంధకార మావరించి యుంటుంది. ఆ సమయంలో సద్వస్తువనే భగవంతుని సంకల్పం మాత్రమే మిగిలి యుండేది.

అది రూపంలేనిది. ఐనా బ్రహ్మపదార్థమైనందున దానికదే ఒక రూపం కల్పించుకుంటుంది. దాని పేరే పరమేశ్వరుడు. ప్రళయానంతరం తిరిగి సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడు తననుండి స్త్రీ రూపంగల శక్తిని సృజించు తాడు. అదే మహామాయ. దానిని శివ అనియు శ్రీమాయ యనియు నంటారు. అంతట పరమేశ్వరుడు సద్యోజాతం, వామదేవం, అఘోరం, తత్పురుషం, ఈశాన్యములనే ఐదుముఖాల వాడవుతాడు. అంతేకాకుండా ఆవిరాట్పురుషు నికి మొఖాన చంద్రకళ ప్రకాశిస్తుంది.

ప్రకృతి పరమేశ్వరులిద్దరూ తపస్సులుచేసి విశ్రాంతి తీసుకొనిన సమయంలో వారి నాలుగు భుజాలతో ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాని పేరు మహావిష్ణువు. పరమేశ్వరుని ఆజ్ఞతో విష్ణువు తపస్సుచేశాడు. వాని శరీరం నుండి ఉదకం స్రవించి ప్రపంచమంతా జలమయినది. ఆ నీటియందే నారా యణుడు శయనించి యోగనిద్ర చెందాడు. విష్ణుదేవుని బొడ్డునుండి కమలం పుట్టింది. ఆ కమలంనుండి పురుషాకారంతో బ్రహ్మదేవుడు పుట్టాడు. బ్రహ్మ కూడా శివాజ్ఞచే తపస్సుచేశాడు. అటుతరువాత తన తండ్రిని చూడడానికి పండ్రెండేండ్లు తపించాడు. అప్పుడాయనకు విష్ణుదర్శన మయింది.

కాని, యిందులో వారిద్దరకూ శివమాయవలన గర్వం యేర్పడింది. తండ్రి కొడుకులిద్దరూ "నీకన్న నేను గొప్పవాడ ననగ నీకన్న నేనే గొప్ప వాడ"నని ఒకరినొకరు వాదించుకున్నారు. ఆ వాదన పెరిగి పెరిగి చివరకు పెద్దదై ఒకరిమీద యింకొకరు చేయిచేసుకునేవరకూ వచ్చింది. విష్ణు బ్రహ్మ లిద్దరూ యుద్ధం చేయబోయే సమయంలో వారిమధ్య నొక లింగం వెలిసింది. అది ప్రళయకాలాగ్నిమాదిరిగ ప్రకాశించింది. పార్థివలింగాన్ని చూచినంతనే

భయపడిన తండ్రికొడుకులు వారి వైరాలను విరమించుకొని "ఈ లింగ మేమిటి? ఇక్కడి కెలాగా వచ్చింది? అసలు దీని సంగతేమిటో తెలిసికొనడ మవసర"మనే నిర్ణయానికి వచ్చారు.

అప్పుడు విష్ణుదేవుడు ఆది వరాహావతారం దాల్చి నేలను త్రవ్వుకుంటూ పాతాళలోకం అడుగుదాకా పోయినప్పటికినీ వానికా లింగం పాదాలు కనపడకపోయినందున విసిగివేసారి వెనుకకు తిరిగి తాను మొదట బయలు దేరిన చోటుకేవచ్చాడు. అలాగే బ్రహ్మదేవుడుకూడా హంసరూపం పొంది పైకెగసి ఊర్ధ్వలోకందాకా పోయినప్పటికిని లింగం తల కనపడనందున ప్రాణం విసుగెత్తి తిరిగివచ్చి మొదటిచోటునే చేరుకున్నాడు. బ్రహ్మ విష్ణువు లిద్దరూ వారిమధ్య రూపొందినది శివాంశయని గ్రహించి చేతులు ముకుళించి ప్రార్థించారు. అంతట వారికి "ఓమ్" అను ప్రణవనాదం గంభీరస్వరంలో వినబడింది.

విష్ణు బ్రహ్మలు వారికి వినబడినదేదియో తెలియక తికమకలు పడుచుండ వారికి స్ఫటికమువంటి కాంతికలిగిన తేజంకూడ కనపడింది. తండ్రి కొడుకులు దానినికూడ ఇది యిదియని పోల్చుకొనలేక పోయారు. కొంత సేపటికి నారాయణుని మనసునకు మాత్రమిది శివస్వరూపమను యూహ కలిగింది.

ప్రణవమైన ఓంకారము మొదట అకారంతో ప్రారంభమై ఉకారంతో కలిసి మకారం పలుకుతూంది. అకార ఉకార మకారాల సంయోగం ఓంకార మని మహామునులు వివరించియున్నారు. దీనిలోని అకారము బ్రహ్మస్వరూప మగు బీజము. ఉకారము విష్ణుస్వరూపమగు బీజము. మకారము శివస్వరూప

మగు బీజము. అనగ యీ ముప్పురిలో సృష్టిచేయునది బ్రహ్మ. సృష్టి నంతయు పోషించి పాలించునది విష్ణువు. దానిని తిరిగి లయముచేయు సర్వాకారముకుదిరుద్రత్వము. కావున మహోత్తమమైన మహేశ్వరావతారమే యీ లింగమని మనోజ్ఞానంతో గ్రహించిన మాధవుడు బ్రహ్మదేవునకు వివరించి చెప్పుచుండగ పరమశివుడు మందహాసములు సేయుచు వారి చెంతకు వచ్చి నిలుచున్నాడు. బ్రహ్మ విష్ణువులా మహనీయునికి చేతులు ముకుళించి స్తోత్రములు చేశారు.

ఆ శివమూర్తి తన్ను భక్తి వినయంబులతోను శివపంచాక్షరీ మంత్రముతోను, మృత్యుంజయ మంత్రముతోను, దక్షిణామూర్తి మంత్రముతోను ధ్యానించిన హరిబ్రహ్మలయందు దయకలిగి వారికి వేదముల నిచ్చాడు. ఆ సాంబశివుడు వారితో "బిడ్డలారా! మీలో విష్ణువు నా శరీరమునందలి కుడి భాగమునుండియు, బ్రహ్మ యెడమభాగమునుండి పుట్టిన నాకుమారులు. మీరు సదా నారూపమును పూజించుచు నా నామమంత్రమును జపించుచున్న మీ కే లోపములు లేక నేను కాపాడుదును. ఓయీ! బ్రహ్మదేవా! నీకై నియమింపబడిన సృష్టిని నీవు కొనసాగింపుము. ఓయీ! విష్ణుదేవా! నీకై నియమింపబడిన పోషణకార్యమును నీవు చేయుచుండుము. మీకు నేనా శక్తి నిచ్చుచున్నా"నని వారిని దీవించాడు. వారందులకు తలలువంచి "దేవా! మీరనినట్లు మీ యనుగ్రహం మాకు సర్వదా కలుగుగాక"యని వారివారి నెలవులకు వెళ్ళిపోయారు.

## శంకరు డిచ్చిన సందేశము

అలాగా కొంతకాలం జరిగింది. సృష్టిప్రారంభమై నడుస్తోంది. బ్రహ్మదేవుని మనసులో యిదంతా నేను చేయుచున్నాను. నేను రచించిన నా సృష్టిమీదనే యెవరేపనిచేసినా జరుగుతుంది. నా సృష్టే లేకపోతే యీ విష్ణువు పోషించేదెవరిని? కనుక నేనే అందరికన్నా గొప్పవాడననే తలం పేర్పడింది. విష్ణుదేవుని మనసులోకూడా "ఆ బ్రహ్మ సృష్టిచేసినంత మాత్రాన ప్రయోజనమేమున్నది! నేనే యీ జగన్నాటకాన్నంతా నడుపు తున్నాను కనుక నాకంటె మించిన మొనగాడు లేడనే స్వాతిశయం పెరిగింది. ఐనా, వారిలో యెవరుకూడా వారి మనసులలోని యభిప్రాయాలను బయటకు రానీయలేదు. ఒకసారి హరి బ్రహ్మ లిద్దరూ కైలాసం పోవడం తటస్థ మయింది.

శివుడు వారిద్దరినీ తగిన మర్యాదలుచేసి కూర్చుండబెట్టాడు. యోగ క్షేమాలన్నీ విచారించాడు. బ్రహ్మదేవుని మనసులోని మాట— విష్ణుదేవుని మనసులోని భావంగూడా శివదేవుడు తెలుసుకున్నాడు. అసలు మూలరహస్యం వారికి తెలియచేయాలనుకొని యిలా మాటాడాడు. "వత్సలారా! మీరాక నాకు చాల సంతోషమయింది. మీకు నాయందున్న భక్తివిశ్వాసాభిమానాల కానందం. ఆనాడు మీరుకోరినట్లే మీకు నాయందు భక్తి ప్రసాదించాను. నా యుప దేశాన్ని అనుసరించి మీరీ సృష్టి పోషకాలు చేయుచున్నందులకుగూడ నే నానందించుచున్నాను. మీకింకా నేను చెప్పవలసిన వానిని చెప్పుచున్నాను.

సృష్టి స్థితి లయలను చేయువాడను నేనే. అప్పుడు నేనే బ్రహ్మ విష్ణు మహేశ్వర కృత్యములను నెరవేర్చుచుందును. అనగ విరాట్పురుషుండ నైన నేను సృష్టిచేయునపుడు బ్రహ్మ నయ్యెదను. పాలనచేయునపుడు విష్ణునయ్యెదను. అటులనే లయము సేయునపుడు శివుడ నయ్యెదను. తెలి యనివారు యీ మూడు నామములను వేరు వేరులని భావించెదరుగాని యోగీం ద్రులు మాత్రము నన్ను నామ రూపక్రియలు లేని ప్రణవోంకార స్వరూపు నిగా నమ్మి ధ్యానించుచున్నారు. ఆభరణము లెన్నిరూపములతో నున్నను వానికి మూలమైన బంగారమొక్కటియే యైనట్లు ఆకారము లెన్నయినా ఆత్మయొక్కటియే యగుచున్నది.

అదటులుండనిండు.

బ్రహ్మదేవా! నేను నీ నుదుట బుట్టుదును. అపుడు నీవు నాకు రుద్రుడ వని నామకరణముసేయుము. రుద్రుడనగ పాపములు చేయువారిని దగినట్లుగ దండించి యేడ్పించువాడని యర్థము. అప్పుడును నేనీ రూపమునందే యుందును. నా పరిపూర్ణావతారమైన రుద్రాంశ మహా మాయకు లోబడక ప్రకాశవంతము కాగలదు. ఓయీ! నా శక్తి కొంత సరస్వతీ రూపంతో నీకు సహచారినియై యుంటుంది. నీవు రజోగుణ ప్రధానముగ సృష్టికార్యము నందే యుండుము. నారాయణా! నా శక్తి కొంత లక్ష్మీరూపమున నీ యందు నిలిచియుంటుంది. నీవు సత్వగుణా ప్రధానంబుగ పరిపాలనా కార్యమునందే యుండుము. ఇక రుద్రమూర్తిని నేను కాళీ సమేతంబుగ తామస గుణ ప్రధా నుండనై దండన కార్యమునందుండును.

ఇంకొక రహస్యమున్నది. మీలోని వారికి నాకును భేదము లేదు. శివుడే కేశవుడు—కేశవుడే శివుడనియు జ్ఞానులు గ్రహించినారు. ప్రపంచం మీద మా యిద్దరి రూపములే బహుళ వ్యాప్తము నొంది యుండగలవు. ముందు ముందు దేవదానవ గణములు పుట్టనున్నవి. వారిలో దేవతలు లౌకికము గలవారై యుందురు. రాక్షసులట్టివారు కాక పట్టుదల కలిగిన వారై ఘోర తపస్సులు చేస్తారు. వారి తపో వేడిమికి లోకాలు గూడా బూడిదయై పోదగిన ప్రమాదములైనను సంభవింప వచ్చును. అది జరుగరాదు. కమలాసనా! అట్టి సమయంలో నీవు వారికి ప్రత్యక్షమై అడిగిన వరము లిచ్చుచుండుము.

బ్రహ్మవలన వరములు పొందిన దానవులు మంచివారైన యెడల మంచిదియే. లేక వారీ వర బలముల చూచుకొని గర్వించు లోకంబుల కపకారులైనపుడు వారిని వధించుటవసరము కావున విన్ము దేవా! నీవా పని చేయుచుండుము. బ్రహ్మ వరముల పొందిన వారినైనను లోక కళ్యాణమునకై సంహరింపగల యుక్తి శక్తులను నేను నీకు ప్రసాదించాను. అవసరమైనపుడు నేనును నీ వలెనె దుష్ట రాక్షసులను వధించు చుందును. ఇక పోయి రండని నియమించాడు. అంతట బ్రహ్మ శంకరులు లేచి సాంబమూర్తికి నమస్కరించి పార్థివ లింగము నారాధించిన తరువాత యెవరి స్థానాలకు వారు తిరిగి పోయారు.

# హాటకలింగము - చరిత్ర

బ్రహ్మదేవుని సృష్టి విస్తరించింది. దేవతలు, దానవులు, మానవులే గాక మృగాలు, జంతువులు, పక్షులు; క్రిమికీటకాలు; చెట్టు, చేమలన్నీ అవతరించినై. భూమి మీద కొండలు పుట్టి పెరిగినై. నదులు ప్రవహించినై. ఉద్యానవనములు, అడవులు పెరిగినై. వీనికన్న ముందుగనే నక్షత్రాలు; సూర్యచంద్ర గోళాలు ప్రకాశించినై. అగ్ని, నీరు, గాలి మొదలైన భూతాలు రూపొందినై. దారుకావనంలో చాలమంది మునులు వారి వారి భార్యలతో కాపురాలు సరిదిద్దుకుంటూ; జపతపాలు చేస్తూ; ఈశ్వరు నారాధిస్తూ కాలం గడుపుకుంటున్నారు.

ఒకనాడా మునులంతా తమ కుమారులను, శిష్యులను వెంట బెట్టుకొని దర్భలు మొదలగు వానిని గొనిరా దూర ప్రదేశాలకు పోయిన సమయం. నటరాజప్పుడు ముని కాంతల మనసులను పరీక్షింపనెంచి తానొక చక్కదనాల పడుచువానిగ మారి శరీరము మీద బట్టలు లేకుండగ చేసుకుని యీ మునుల యిండ్లలో బిక్ష మడగడానికని దారుకావనంలో ప్రవేశించాడు. ఆయనను చూచినంతనే మునికాంత లందరికీ యండగాని మీద మోహం కలిగి ఏమైనా గాని ఆ సుందరాంగునితో కామ సుఖాలనుభవించి తీరాలనుకున్నారు. శివుని చుట్టూ మూగారు. ఎవరికివారే శంకరు నాలింగనం చేసుకోవాలనే తాపత్రయం చెందారు. వారిలో కొందరికి వస్త్రములు లేకుండ పోయినై. ఐనా వారికాస్థితి తెలియని పిచ్చిప్రేమలో పడ్డారు.

అదే సమయమున దర్భలకై పోయిన మునులంతా తిరిగి వచ్చి యీ దృశ్యం చూచారు. వారి భార్య లిట్లొక దిగంబరుని వెంటబడడం చూడగ వారికి యెక్కడలేని కోపం రెచ్చిపోయింది. భార్యలను రమ్మని పిలిచినా వారీ పిలుపులను వినిపించుకొనే పరిస్థితిలో లేరు. కొంతమంది స్త్రీలు తమ్ము తమ భర్తలు పిలవడం వినబడినా వినబడనట్లే నటించారు. అదంతా మును లకు తీరని తలవంపయింది. తమ స్త్రీల నంతగా వశపరచుకొనిన ఆ యువ కుని మీద రాలు రువ్వినా, కర్రలతో కొట్టినా ప్రయోజనం లేకపోయింది ఆయన చిరునవ్వులు నవ్వుతున్నాడు. అదిచూచి మునుల కడుపు మంట మరింత. పెద్దదయింది.

చివరకా మునులంతా కలిసి మన మెట్లైనను మునులంగదా! మనకు తపోబలమున్నది గదా! మన మీతనిని శపించుదామనుకొని "ఓయీ! ముని పత్నులను మోహింప చేయుచున్న యువకా! నీ లింగమూడి భూమి మీద పడుగాక" అని ఘోరంగా శపించారు. అప్పటికప్పుడే కపటపు బిచ్చగాడు మాయమయ్యాడు. అంతకు ముందా శివుడు నృత్యం చేసిన చోటు నందొక దివ్యలింగమవతరించింది. అది చూచుచుండగనే యెత్తు పెరిగింది. దాని నుండి పుట్టిన మంటలు గగన మండలందాకా వ్యాపించడమే గాక మునుల వెంటబడినై. ప్రళయాగ్ని వోలే భూ తలము నంతటా వ్యాపించుచున్న మంటలను చూచి భయపడిన మునులంతా పరుగెత్తి పోయి బ్రహ్మదేవునితో చెప్పుకున్నారు. చతురాననుడంతట దివ్యదృష్టితో చూచి అసలు విషయం తెలుసుకున్నాడు. "ఓ మునులారా! శంకరుడు మిమ్ములను కరుణింప వచ్చి యుండగ వాని లీలలు గ్రహింపలేక మీరాయననే శపించి యీ ప్రమాదం

తెచ్చుకున్నారు. అనుభవింపక తప్పేదేమున్నది? ఐనను నేనొక యుపాయం చెప్పగలను.

మీరిపుడు మాయాశక్తి స్వరూపిణి యైన పార్వతిని ప్రార్థించండి. ఆమె ప్రసన్నురాలైన తరువాత మీ విపత్తు చెప్పుకొనండి. ఆమెయే శివ లింగమును భరింపగల శక్తిగల దేవత. మీరొక అష్టదళ పద్మంలో కుంభము నుంచి గంగాజలం నింపి నమక చమకములు; వేదోక్త మంత్రములు చదువుచు లింగాభిషేకము చేయుదురేని శంకరుడు శాంతించి మిమ్మనుగ్రహింప గలడని చెప్పాడు. బ్రహ్మ చెప్పిన దానిని అక్షరం పొల్లు పోకుండా మునులు భక్తి శ్రద్ధలతో నాచరించారు. వారికి దర్శన మిచ్చి కరుణించిన పరమేశ్వరి యోనిరూపం ధరించి యాకర్షించినందున లింగమందే నిలిచి పోయింది, ఇట్లు రూపొందిన శివలింగమునా ఋషులు బహువిధములుగా కొనియాడారు. పార్వతీ పరమేశ్వరులంతట మునీంద్రులకు నిజరూపంబుల దర్శనంబు లిచ్చి "తాపసోత్తములారా! మమ్మారాధించిన మీకు సకల భద్రములు కలుగును గాక" యని అశీర్వదించారు.

దారుకావనమునందలి ప్రభావంగల లింగములలో నీ హాటకేశ్వర లింగము ప్రసిద్ధి చెందినది. హాటకేశ్వరుని దేవతలు, దానవులు మానవులందరూ పూజించుచున్నారు. మహాజ్ఞానులైన వారీ లింగములను గురించి; లింగ భావములను గురించి; లింగ మహాత్యములను గురించియు రక రకములుగా వర్ణించి చెప్పుచున్నా"రని సూతముని శౌనకాదులకు తెలిపినట్లు మనకు పురాణములు నేడు సాక్ష్యము లిచ్చుచున్నవి. పుణ్యస్థలంపైన మన భారత దేశము నందింకను చెప్పుకొనదగిన లింగము లెన్నియో కలవు.

# పన్నెండు ఉప జ్యోతి లింగములు

పరమ శివుని రూపములైన పంద్రెండు జ్యోతిర్లింగములకు పన్నెండు ఉపజ్యోతి లింగములు కూడా కలవు. వానిలో 1. అంతకేశ లింగము—ఇది సోమనాథలింగానికి ఉపజ్యోతి లింగము. వసుమతీ సాగ రము నందున్నది. 2, రుద్రేశ్వర లింగము—ఇది మల్లికార్జున లింగానికి ఉపజ్యోతి లింగము. భృగుకక్ష యందున్నది. 3. దుర్గేశ లింగము—ఇది మహాకాళ లింగానికీ ఉపజ్యోతి లింగము. నర్మదా నదీ తీరమునందున్నది. 4. కర్దమేశ లింగము—ఇది ఓంకార లింగానికి ఉపజ్యోతి లింగము. బిందు సరోవరము నందున్నది. 5. భూతేశ లింగము—ఇది కేదారలింగానికి ఉపజ్యోతిలింగము. యమునానదీ తీరము నందున్నది. 6. భీమేశ్వర లింగము—ఇది భీమశంకర లింగానికి ఉపజ్యోతిలింగము. మల్లికా సరస్వతీ నదీ తీరము నందున్నది. 7. భూతేశ్వరలింగము—ఇది నాగేశ్వర లింగానికి ఉపజ్యోతిలింగము. ఇదియు మల్లికాసరస్వతీ నదీతీరమునందే యున్నది. 8. వ్యాఘ్రేశ్వర లింగము—ఇది ఘుశ్మేశ్వర లింగానికి ఉపజ్యోతిలింగము. 9. గుప్తేశ్వరలింగము, ఇది రామేశ్వరలింగమునకు ఉపజ్యోతిలింగము.

బిందు సరోవరము హిమాలయ పర్వతము మీద కైలాసమని ప్రసిద్ధిగాంచిన మైనాక కొండ శిఖరము నందున్నదని ప్రతీతి. ఈ సరోవర ప్రాంతమున బంగారము; నవరత్నములు చిన్నచిన్న కొండంల ప్రమాణము నందుండేడి వనియు; ద్వాపర యుగంబున మయ బ్రహ్మాచార్య శిల్పి పదునాల్గు నెలలక్కడనే యుండి మయసభ నిర్మించే

ననియు; ఆ మయసభా భవనంబును యెనుబది వేల మంది రాక్షసభటులచె తెప్పించి యింద్రప్రస్థలమును పాలించుచున్న పాండవుల కిచ్చెననియు మనకు భారత ప్రమాణమున్నది.

## పంచ భూత లింగములు

1. పృథ్వీలింగము—కంచియందున్న యేకామ్రేశ్వరలింగం
2. జలలింగము—జంబుకేశ్వరమందున్న జంబుకేశ్వరలింగం
3. తేజోలింగము—తిరువణ్ణామలలో నున్న అరుణాచలేశ్వరలింగం
4. వాయులింగము—శ్రీ కాళహస్తియందున్న కాళహస్తేశ్వరలింగం
5. ఆకాశలింగము—చిదంబర మందున్న నటరాజేస్వామిలింగం. మన కంటికి కనబడదు.

## పంచారామ లింగములు

1. భీమేశ్వరలింగము—స్వాముల వారి దేవేరి మాణిక్యాంబ. దాక్షారామ క్షేత్రము. సమీపము నందే అగస్త్యేశ్వర. గణేశ్వర. భైరవేశ్వర. నాకులేశ్వర లింగములున్నవి.

2. కుమార భీమేశ్వర లింగము—ఇది కుమారస్వామిచే ప్రతిష్ట చేయబడిన లింగము. రాజ మహేంద్రవరము, కాకినాడల మధ్య సామర్లకోట యొద్ద కుమారారామము నందున్నది.

3. సోమ లింగము — సోముని (చంద్రుని)చే ప్రతిష్ట చేయబడి నది. సోమారామము నందున్నది.

4. శ్రీరామలింగము—శ్రీరామునిచే ప్రతిష్ట చేయబడినది. క్షీరా రామము (పాలకొల్లు) నందున్నది. శ్రీ సింహాద్రి విశ్వనాథా వధూత వారి జన్మస్థానము.

5. అమరేశ్వర లింగము—అమరేంద్రుడు (దేవేంద్రుని)చే ప్రతిష్ట చేయబడినది. గుంటూరు మండలమునకు చెందిన అమరావతి (కృష్ణానది తీరము) నందున్నది. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు పాలించిన నగరం.

## పంచ భూతాత్మక లింగ స్వరూపములు

ఆకాశము నాద రూపకముగను, అగ్ని తేజో రూపకముగను, వాయువు జలరూపకముగను, జలము ప్రవాహరూపముగను, సూర్య చంద్రులు జీవధారమైన సువర్ణకాంతిగ సమగూడి శివ తత్త్వమున చెప్పబడి నది పంచ భూతాత్మక శివలింగ మనంబడుచున్నది.

# పూర్వ దిగ్లింగములు

పూర్వ దిగ్లింగములనగా తూర్పు భాగమున నున్న లింగములు— అవి గంగానది సముద్రములో కలియు చోటున సంగమేశలింగము— కౌశకీ నదితీరమందున నాగేశ్వర (సిద్ధనాధ) లింగము—ఫల్గుణీ నదీ తీరము నందు భర్గలింగము—గండరీ నదీ తీరము నందు ప్రభులింగము—త స్తకా నదీ తీరము నందు కుమారేశ్వర లింగము—ప్రయాగ క్షేత్రము నందు బ్రహ్మలింగము—అయోధ్యా క్షేత్రమునందు నాగేశ్వర లింగము—సింధు సముద్ర తీరము నందు కపాలేశ్వర లింగము—అటులనే వక్త్రేశ్వర; ధౌతపాపేశ్వర; భీమేశ్వర; శ్రీ చంద్రకేశ; సిద్దేశ్వర; బలేశ్వర; జప్యేశ్వర; డూరేశ్వర; శృంగారేశ్వర; శనేశ్వర; గ్యాపేశ్వర; వైద్య నాధేశ్వర, వామేశ్వర, కామేశ్వర, సూర్యేశ్వర, సంగమేశ్వర, విమలేశ్వర, వ్యాపేశ్వర, భాండేశ్వర, కుంభేశ్వర, కేరేశ్వర, భూతేశ, శుకేశ్వర, సులోచనేశ్వర, సిద్దేశ్వర, నందికేశ, పుంజేశ, రామేశ, సోమేశ్వర, శూల టంకేశ్వర, మాధవేశ్వర, లోకేశ, రాంగేశ, వటౌశ, నందీశ్వర, కంట కేశ్వర, మాధవేశ్వర, శరణేశ్వర, కర్దమేశ్వర, అచలేశ్వర, ఆనందేశ్వర, యోగీశ్వరాది లింగములెన్నియో ప్రసిద్ధిగాంచినవి.

# దక్షిణ దిగ్లింగములు

దక్షిణ దిగ్లింగములనగా దక్షిణ భాగమున నున్న లింగములు:— సంగమేశ్వరుడు కాలంజదీ పర్వతమునందు వెలసి యున్నాడు. నర్మదా నదీ

తీరము నందున్న పాషాణము లన్నియు లింగము లనియే చెప్పబడు చున్నవి. వానిలాగే ముఖ్యము లైనవి ఆ త్రేశ్వర, పరమేశ్వర, సింహేశ్వర, కర్వేశ్వర, కుమారేశ్వర, పుండరీకేశ్వర, పండమేశ్వర, తీక్షణేశ్వర, దుంధు కేశ్వర, శూలేశ్వర, కుంభేశ్వర, కుంచేరేశ్వర, సోమేశ్వర, మంగలేశ్వర, హనుమదేశ్వర లింగములు.

పశుపతీశ్వర లింగము గోదావరి కపర దిక్కునను, అత్రీశ్వర, భువనేశ్వర, ముఖాలింగములు వంశధారానదీ ప్రాంతములందును, కుక్కు టేశ్వర, రాజరాజేశ్వర లింగములు పిఠాపురము నందును, మార్కండేశ్వర లింగము గోదావరతీర రాజమహేంద్ర వరము నందును, అగస్తేశ్వర లింగము ధవలేశ్వర మందును, భీమేశ్వర లింగము దాక్షారామమందును, కుమారభీమేశ్వర లింగము సామర్ల కోటి యందును, సోమలింగము గూని పూడి యందును, శ్రీరామలింగము పాలకొల్లు నందును, అమరేశ్వరలింగము అమరావతి యందును, సోమేశ్వర లింగము కోటిపల్లియందును, వ్యాఘ్రే శ్వరలింగం వ్యాఘ్రపుర మందును, వీరచంద్ర లింగము పట్టి సముద్రమం దును,రాజరాజేశ్వర లింగము వేములవాడ భీమకవి యని ప్రసిద్ధిచెందిన భీమ కవిగారి జన్మస్థానమను వేములవాడ యందు వెలసి యున్నది.

కాలేశ్వరస్వామి కాలేశ్వరములోను, మల్లికార్జునస్వామి కృష్ణా తీర మందలి విజయవాడలోను, మహాకాలస్వామి వేలాపురములోను, అగస్తేశ్వర స్వామి మచిలీపట్నమునకు సమూపమునందలి పెడన గ్రామములోను, నాగేశ్వరస్వామి కృష్ణానది సాగరసంగమందు సేయుచున్న కళ్ళేపల్లిలోను, బలేశ్వరస్వామి కృష్ణాతీరమందలి ముక్త్యేశ్వరము లోను, అగస్తేశ్వరస్వామి

యామని (తెనాలి ప్రక్క) గ్రామములోను. కోటీశ్వరస్వామి ఎల్లమంద లోను, సాగరేశ్వరస్వామి మాదలలోను, ధవళేశ్వరస్వామి ధవళపురము లోను, కపోలేశ్వరస్వామి చేజెర్లలోను, ఇష్టకామేశ్వరస్వామి మాచర్ల (బ్రహ్మనాయునిచే నిర్మింపబడిన నగరము) లోను, త్రిపురాంతక మహా నందేశ్వర—ఓంకారేశ్వర స్వాములు ఓంకారేశ్వర స్వాములు ఓంకార క్షేత్రములోను, బ్రహ్మేశ్వరస్వామి అలకపురి నవబ్రహ్మలలోను వేంచేసి యున్నారు.

అగస్త్యేశ్వర సంగమేశ్వరులు కృష్ణానదీ యుత్తర తీరమందలి వాడ పల్లి చెంత, ఐలేశ్వరుడు శ్రీశైల మల్లికార్జునాలయము యొక్క ఉత్తర ద్వారము చెంత, పాలంకేశ్వరుడు పాలంకచెంత, వీరభద్రుడు ముదిగొండ చెంత, మహాలింగేశ్వరుడు నిడదవెల్లి వాగుచెంత, హరిహరేశ్వరుడు పెన్నా నదీ తీరమందలి సింహపురి (నెల్లూరు-నెల్లూరు రంగనాయకుల స్వామియని ప్రసిద్ధిగాంచిన నగరము) చెంత, శ్రీ కాళహస్తీశ్వరుడు (వాయులింగము) దక్షిణ కైలాసం బనంబడు శ్రీ కాళహస్తి చెంత, త్యాగరాజ పరమేశ్వరుడు తిరువత్తూరు చెంత, కాపాలేశ్వరుడు చెన్నపట్టణమునకు చెందిన మైలాపూర్ చెంత, వేదగిరీశ్వరుడు వేదగిరి చెంత ఏకామ్రేశ్వరుడు కంచి పురాధీశ్వరి కామాక్షీదేవి చెంత, సిరిమాయూరేశ్వరుడు మయూరము చెంతను నిలిచి దర్శనము లిచ్చుచున్నారు.

మహాలింగం మధ్యార్జునమందు - ఉమామహేశ్వరలింగం బయ్యారి యందు—బ్రహ్మపురీశ్వర లింగం బయ్యారి కొండకు దిగువ ప్రదేశము నందు—కంపహరేశ్వర—ధర్మ సుందరనాథ లింగములు శరభావతార

త్రిభువనమందు— మార్గబంధీశ్వర లింగం విరించి పురమందు—బిల్వేశ్వర లింగం తిరువళదేశమందు, వైద్యేశ్వర లింగం వైద్యనాథమందు;—అరుణా చలేశ్వరలింగం అరుణాచలమందు-నటేశ్వరలింగం చిదంబరమందు-కుంభే శ్వర, బృహదీశ్వర, నాగ, సోమేశ్వర లింగాలు కుంభకోణమందు, జంబు కేశ్వర లింగం జంబుకేశ్వర మందు, మాతృభూతేశ్వర లింగం తిరుచునా పల్లి యందు. పంచనాధేశ్వర లింగం తిరువయ్యారునందు—మంగలేశ్వర లింగం ఉత్తరకోశమందు—విశ్వేశ్వరలింగం రామేశ్వరమందు—మార్కం డేశ్వరలింగం కడలూరులందునను ప్రకాశించుచు దక్షిణ భారత దేశము నందున్నది.

# ప్రదీచీ దిగ్లింగములు

ప్రదీచీ దిగ్లింగములు లనగా పడమరభాగమున నున్నలింగములు:— మైసూరులో నంజుండేశుడు పంపా సరస్సు తీరాన విరూ పాక్షేశ్వరుడు— పడమటి సముద్రతీర మందలి గోకర్ణ క్షేత్రములో మహాబలుడు— ద్వారకా నగరములో మహాదేవుడు—కపిల నగరంలోనే కాలరామనాధుడు— పడమటి సముద్ర తీర మందలి వాలుకేశ మహామాయా పురంలో మహాసిద్దే శ్వరుడు—కొండ మీదబాబుల్ నాధుడు—పండరిక్షేత్రంలోపాండురంగేశ్వర లింగములును గాక యింకను పెక్కు లింగములు పడమర దేశమందు వెలు గొందు చున్నవి.

## ఉదీచీ దిగ్లింగములు

ఉదీచీ దిగ్లంగము లనగా ఉత్తర భాగమున నున్న లింగములు:— దాధీచి లింగము మిశ్ర బలష్ణి తీర్థము నందును, ఋషీకేశ లింగము నైమిశారణ్యము నందును, సత్యద్యుతి శివలింగము నైమిశారణ్యము నందును, లలితేశ్వరలింగము దేవప్రయాగ తీర్థము నందును, పశుపతీశ్వర లింగము నేపాలు రాష్ట్రమందును, (ఇచటి యీ లింగము యొక్క శిరము యాత్రికులకు కనబడదు.) కేదారేశ్వరలింగము కేదారవనమందు, ముక్తినాధలింగం గండకీ నదీతీరమందును, అమరనాద లింగం కాశ్మీరమునకు తూర్పునందును. తారకేశ్వరలింగం వంగదేశమునకు క్షేత్రపాలకుడై భారతదేశ మందలి యుత్తర భాగమందునున్నారు. అటులనే పంచవక్త్రేశ్వరుడు హరిద్వారమందును, దక్షేశ్వరుడు కనఖిలము నందును, వైద్యేశ్వరుడు గోకర్ణము (రావణ బ్రహ్మ ప్రతిష్ట) నందునుకలరు. మనదేశము నందింకను చెప్పుటకలవిగాని సంఖ్యలో లింగములవతరించినై.

## శేష మునీంద్ర బాలవాసు కిలు

నాయనలారా, దక్షిణ భారతదేశమందలి ఆంధ్రప్రదేశమున నెల్లూరు మండలానికి జెందిన పామూరునకు సమీపమున అనుమునిగిరిక్షేత్రం. భైరవ కోనలను దివ్యస్థలములున్నవి. భైరవకోన యనంబడు మహాపర్వతం మీద కోటినొక్క శివలింగములు, నూట యిరువ దెనిమిది దేవాలయములు,

నూటొక్క నీటి దొనలు నున్నవి. మరియు నచట ప్రశస్తములైన చెట్లు వనములు శిలలు సుందర ప్రదేశములు వానికిం దగిన చరిత్రలు గలవు. వాని వివరంబుల నాలకింపుడు.

మొదటి నుండి దేవతలకు దానవులకు మంచిమర్యాదలు లేక కయ్యా మాడుకుంటూండేవారు. ఐతే రాక్షసుల గురువైన శుక్రాచార్యులవారు మృత సంజీవినీ విద్య గ్రహింపగలిగారు. మృతసంజీవిని అనగ చనిపోయిన వారిని బ్రతికించే విద్య. దానివలన శుక్రాచార్యుడు తన వర్గంలోనివారు చనిపోయినపుడు వారిని తిరిగి బ్రతికించుచున్నాడు. అదిచూచి దేవతల రాజైన దేవేంద్రునికి కన్నుకుట్టింది. దేవగురువులైన బృహస్పతితో దేవేంద్రుడు "మనకా సంజీవినీ విద్య లభించేదెలాగా?" నని యాలోచించాడు. అప్పుడా గురుశిష్యులొక యుపాయం పన్ని బృహస్పతి కుమారుడైన కచుని పిలిచి "వత్సా ! నీవా శుక్రాచార్యులవారియొద్దకుపోయి యెటులైనను మృతసంజీవినీ విద్యా రహస్యం తెలిసికొనిరమ్మ"ని చెప్పి పంపించాడు.

కచుడు వెంటనే పోయి శుక్రు నాశ్రయించాడు. వచ్చిన విద్యార్థి తమకు పగవారైన దేవతలకు సంబంధించినాడని శుక్రాచార్యులు గ్రహించియు వాని వినయాది మంచి గుణంబుల కానందించి శిష్యునిగ స్వీకరించాడు. కాని రాక్షసుల కది యెంతమాత్రమూ గిట్టలేదు, కొన్ని పర్యాయములా దానవులు కచుని చంపివేశారు. ఐతే శుక్రాచార్యులవారి ప్రియ కూమారి దేవయాని కచునిమీద మమకారంచేత వానిని బ్రతికించుకుంది. తనను వివాహమాడమని కోరింది-బ్రతిమాలింది - భంగపడింది. కాని కచుడు మాత్ర మందుల కంగీకరింపక నిరాకరించాడు. అంతట కోపం రెచ్చి

పోయిన దేవయాని "ఓరీ! విశ్వాసములేని దుర్మార్గుడా ! నీకు ప్రాణదానం చేసిన నా ప్రేమను త్రృణీకరించావు కనుక నీవు మా నాన్నగారియొద్దనుండి గ్రహించిన విద్య నీకుపయోగపడక పోవుగాక" అని శపించింది. అంతట నాగ్రహించిన కచుడు "ఓసీ! దుర్మార్గురాలా ! నాకుపయోగపడక పోయిన యీ విద్య యిక మీదట మీకును యుపయోగపడదు సరికదా! నీకు బ్రాహ్మణ భర్తయూ లభింపక పోవుగాక" అని ప్రతిశాప మొసగి తిరిగి దేవలోకానికి వెళ్ళిపోయాడు.

మృతసంజీవినీ విద్య యిపుడెవరికిని యుపయోగపడక వ్యర్థ మయింది.

అందును గురించి దానవులు దేవతలు గూడ విచారపడ్డారు.

ఆ తరువాత వారిద్దరికీ యొక ఒడంబడిక కుదిరింది. అప్పుడు రాక్షసులకు రాజైన బలిచక్రవర్తితో సంధిచేసుకొన్నారు. దేవదానవులు కలిసి పాలసముద్రాన్ని తరచి; అందుండి లభించిన అమృతాన్ని యుభయులూ సమంగా పంచుకునే నిర్ణయంమీద కడలిని చిలకడానికి మేరువను కవ్వముగా యుపయోగించుకున్నారు. అంతపెద్ద కొండను త్రిప్పడానికి త్రాడు లేక కశ్యప బ్రహ్మకు కద్రువ యందు జనించిన పాములలో పెద్ద దైన శేషుని వాసుకుని సాయం కోరారు. మధ్య మధ్య కొన్ని అవాంతరాలు కలిగినా చివరకు సముద్రం నుండి అమృతభాండం వెలువడి దక్కింది. అది చూచిన త్రిమూర్తులు గూడ సంతోషించారు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరు లందట నాగసోదరులు దేవదానవులకు చేసిన యీ మహోపకారాన్ని యెంతగానో కొనియాడిన తరువాత వారికి

ప్రత్యుపకారంగా సర్పాకారాలు మారి మానవరూపాలు వచ్చేలాగున వరాలిచ్చారు. లోకకల్యాణం కోరి వారిద్దరూ భైరవకోనకు చేరుకున్నారు. భైరవకోన చాల భయంకరమైన అడవి. ఐనా మునులకు నివాసమైన అగమ్యబిల ప్రాంతంలో మాత్ర మెటువంటి భయములుండవు. ఆ మహాఋషులు సంచరించే తాపస నిలయానికి చుట్టూ రాలు పాతబడినై. ఆ పరిధి దాటి యే క్రూరజంతువు గూడ లోపలకు పోలేదు. అచటివారినొక చీమయైనను కుట్టదు. అదంతయు నా స్థల మహాత్యము.

## భైరవకోన - అగమ్యబిలము

తమ్ముడగు వాసుకుని వెంటబెట్టుకొని శేషమునీంద్రులు భైరవకోన చేరునప్పటికీ చాల మంది ఋషులక్కడున్నారు, వారందరును వీరి నభినందించారు. శేషమునీంద్రులవారందరికి పెద్దలేకాక గురుతుల్యులయ్యారు. ఆసమయాన బాలవాసుకి అన్నగారైన శేషమునీంద్రునే పితృభావంబునను గురుభావంబునను సేవించుచు వేదాంతరహస్యాల నన్నింటిని సాంగోసాంగముగా తెలుసుకున్నాడు. వారంతా నివసించే ప్రదేశం అగమ్యబిల మనంబడుతుంది, అగమ్యబిలం లోపల సువిశాల ప్రదేశముంది. అచట సరోవరం కలదు. మనోహరములైన చెట్లు, పూపొదలతో గూడిన వనములున్నవి; పండు వెన్నెల వంటి వెలుతురు — సుగంధంతో గూడిన వాయుచలనం కలిగిన బిలాంతర్గత దృశ్యములు ప్రపంచమునందెందును కనపడవు.

తపోబలము కన్న మించిన బలమింకొకటి లేదు. అసలే గొప్ప మహిమ కలిగిన కశ్యప బ్రహ్మ కుమారుడు — అటుపైన త్రిమూర్తుల వలన — దేవతల వలన — దానవులవలన — మహారుషీంద్రులవలనను వరములను పొందిన మహానుభావుడు, అంతియేగాక తపోశక్తి పొందిన దేవదాంశమూర్తి కావున శేషమునీంద్రులవారు సంకల్పించినంతనే విఘ్నేశ్వరుడు వారియందు నిలిచి వినయంబున చేతులు ముకుళించి "స్వామీ! మీరు నన్ను మనసున సంకల్పించిన కారణమేమిటి? ఇపుడు నావలన కావలసిన కార్యమేదియొ చెప్పండి" అన్నాడు.

శేషమునీంద్రు లంతట వానితో "వినాయకా! నే నిపుడు నివసించి యున్న యీ కొండమీద కోటిన్నొక్క లింగములు నెలకొల్పవలయు నని నాకభిలాష కల్గినది. కేవలము లింగమును నెలకొల్పుటయే గాక కొన్ని దేవాలయములను, దేవ్యాలయములను గూడ రూపొందింపవలసిన పని యున్నది. అందులకు శిల్పాచార్యునిగ నా సోదరుడు—పుత్రసమానుడు—శిష్యుడు నైన మా బాలవాసుకుని నియమించు చున్నాను. నెరవేరవలసిన కార్యము సామాన్యమైనది కాదు. నీవు విఘ్ననాయకుడవు కనుక నీ వాదోడు—చేదోడు లాతని కవసరము. ఎటువంటి యాటంకములను కలుగనీయక నీవు వానివెంటనుండి యీ కార్యము పూర్తిగావింపు" మన్నాడు.

ఆమాట నాలకించుచునే గణపతి స్వామికి నమస్కరించి "మహాత్మా! మీ సంకల్పం జగత్కల్యాణ ప్రదమయినదిగ, ఎందరో మునులకు నివాస యోగ్యమైన యీ కొండమీద లింగముల ప్రతిష్ట చేయుటకన్న కావలసిన దేమున్నది? మీ యాజ్ఞానుసారముగ తప్పక నేను మన బాలవాసుకి వెంటనే

యుండి తాము చేపట్టిన కార్యమును విజయవంతము జేయుదు"నని తల వంచాడు. బాలవాసుకియు శేషమునీంద్రస్వాములవారి వలన దీవెనలు పొంది వినాయకుని వెంట బయలుదేరాడు.

## భైరవకోన - శివలింగములు

వినాయకుని సాయమున్న బాలవాసుకి ఈశ్వరనామ సంవత్సర కార్తీక శుద్ధ పంచమీలు మృగశిరా నక్షత్రయుక్త కుంభలగ్నమున అమృత యోగమున్న శుభకాలమునందు ప్రారంభించి మొదటిదిగా భార్గవఋషి ఆస నపు బండను నిర్మించాడు. తరువాత దుర్గాదేవి వేంచేసియున్న చోటు మన పడమరదిక్కుగా పోయి క్రిందిభాగంలో ప్రముఖ దుర్గాదేవి విగ్రహాన్ని నిర్మించాడు. ఆమెపేరు భైరవ శివకోన దుర్గాంబాదేవి. ఆమెదగ్గరనే భర్గ స్వామియను పేరుననొక లింగమును ప్రతిష్టించాడు. ఆ లింగమును; అమ్మ వారి ప్రతిమను; ఆలయమును; ఆలయ ద్వారములను గూడ నొకరాతిలోనే మలచిన బాలవాసుకి తన శిల్పకళా కౌశలమును ప్రదర్శించాడు.

ఆ పెద్ద శిలలో యీ దేవాలయమును తీర్చిదిద్దిన మహాశిల్పాచార్యు డందులోనే శశినాగు శివలింగం; రుద్రలింగం; కాశీవిశ్వేశ్వరలింగం; రామే శ్వరస్వామిలింగం; నగరికేశ్వరలింగం; భర్గుశివలింగం; శ్రీశైల మల్లి కార్జునలింగం; పక్షగాత శివలింగం; అష్టకాల భైరవ శివలింగములనే వానిని గూడ చెక్కుతూ వానికి గర్భాలయాలు, మండపాలు, దేవాలయాలను చిత్రిం పగా నారాతినుండి వెలువడిన కోవెలలు దొమ్మిదయ్యాయి.

మరియు బాలవాసుకి శశినాగవాగు నుండి తూర్పుముఖంగా కొంత దూరం పయనించి పంచదారలసోన వరకును గల పందొమ్మిది నీటిదొనల లోను 383000 మూడులక్షల యెనుబదివేల శివలింగములను; సోనవాద జల పాత ప్రాంతంలో 2500000 యిరువదైదు లక్షల శివలింగములను; కాలంగి కోనేరు దగ్గర 303000 మూడులక్షల మూడువేల శివలింగములను, పార్వతీ కొలనుచెంత 11000 పదకొండువేల శివలింగములను: కాశికల పంపంలో 19913 పందొమ్మిదివేల తొమ్మిదివందల పదమూడు శివలింగములను ప్రతిష్టలు చేశాడు. ఈ కాశికల కుండమందు ప్రతి కార్తీక సోమవారములలో మునికన్యకలు స్నానములుచేసి అందలి తీర్థమును గొనిపోయి భైరవ కోన యందున్న కాశీవిశ్వేశ్వర లింగము నభిషేకించి వరములను పొందు చున్నట్లు పురాణములు తెలుపుచున్నవి.

పరికలలోయలో 299909 రెండులక్షల తొంబది తొమ్మిదివేల తొమ్మిది లింగములను: సురమతలబోడు మీద 109405 ఒకలక్షతొమ్మిదివేల నాలుగువందల అయిదు లింగములను: మైలకొలను యొద్ద 302005 మూడు లక్షల రెండువేల అయిదులింగములను: శ్రీరామచక్రవర్తి కోటచెంత 71999 డెబ్బదొకలక్ష తొమ్మిదివందల తొంబదితొమ్మిది లింగములను నెలకొల్పాడు.

అచటినుండి పోయి లింగాల వూటులో నొక నాగమణి శివలింగమును ప్రతిష్టించి, దానికి దేవళమును నిర్మించాడు. భైరవస్వామి: వీరభద్ర విగ్రహంబులను తీర్చివానికెదురుగ 796012 ఏడులక్షల తొంబదారువేల పన్నెండు లింగాల నెలకొల్పిన తరువాత కొటికలదొన—తులసిమడుగు గొయ్యి—చంద్ర

లీలమడుగు—పాతాళగంగ మడుగు—కోమలికొలనులను చోటులలో 1813095 పదునేనిమిదిలక్షల పదమూడువేల తొంబదైదు లింగాలను స్థాపనలు చేసి: రాకాసి మూకల బండదగ్గర 93911 తొంబదిమూడువేల తొమ్మిదివందల పద కొండు లింగాలను గూడ నిలిపిన పిమ్మట తిరిగి అగమ్యబిలానికి వచ్చాడు.

బాలవాసుకి అగమ్యబిలానికి తొమ్మిది ద్వారముల నమరించాడు. 39091 ముప్పది తొమ్మిదివేల తొంబదొక్క లింగమును ప్రతిష్ఠించాడు. చీమలగుండబెజ్జముచెంత 1510228 పదునైదులక్షలపదివేలరెండువందలఇరవై ఎనిమిది లింగములను నెలకొల్పాడు. వీరభద్రగట్టు:కలిశకుండముదేవకన్యల తోయపసుపుధారతోయ కుంకుమకుండములనెడి స్థానములలో 301028 మూడు లక్షలఒకవెయ్యి యిరువదెనిమిది లింగములనే మరికొన్నింటిని ప్రతిష్టలుచేసి గురువులవారి మాట తప్పక కోటికొక్క శివలింగ ప్రతిష్టలు—ఆలయనిర్మాణములు పూర్తిచేసి మెప్పుబడిశాడు.

## రామకూరు రామలింగ స్వామి

గుంటూరు మండలమందు చిలకలూరిపేటనుండి ఒంగోలుపోవు రాజ మార్గమునకు సమీపముననే రామకూరను గ్రామమున్నది. అచట కొండ మీదనున్న రామలింగేశ్వరాలయము చాల పురాతనమైనది. త్రేతాయుగంలో సీతాలక్ష్మణులను వెంటబెట్టుకొని దండకారణ్యంలో వనవాసం చేయవచ్చిన

శ్రీరాముడు కొండమీద కొన్నిదినాలు నివసించినట్లు: అపుడీ రామలింగేశ్వర స్వామిని ప్రతిష్ట చేసినట్లును చెప్పుచున్నారు. ఇచటి ప్రజలు నేటికిని కొండ మీద కొన్ని ప్రదేశములను చూపి యివి సీతాదేవి వావనసుంటలాడిన చోటని యివి సీతమ్మవారు స్నానముచేసి తడిబట్టలారవైచిన గుట్టలని యిది రాముడు శయనించిన తావని: యిచట లక్ష్మణుడున్న ప్రదేశములనియు చూపుచున్నారు.

ఆలయమునకు దక్షిణముగ నొక కోనేరున్నది. వైశాల్యము చాలా తక్కువ. కాని లోతు తెలియదు. కోనేరునందు దిగుటకు మెట్లున్నవి. నీటిలో యాత్రికులు ముందుపోవుటకు వీలుపడకుండునట్లుగ యినుపతీగె. లడ్డముగా నమర్చింపబడి యున్నవి. అట్లుంచుటకు కారణమేమనగా యెవరైననా యడ్డు తీగెల దాటి ముందుకు పోరాదు. పోయినచో తిరిగి రాలేరు. నీటిమట్టము నకు పైభాగమున పడమర దిక్కునందొక కొండగోడ కనపడుతూంది. దాని కొక రంధ్రమున్నది. నీటిమట్టమునకు కొంచెము మీదుగ అరగజం విశాల మున్న యీ రంధ్రమునకు చుట్టును చిన్నచిన్న చెట్లుమొలచి యున్నవి. అక్కడకుపోయి చూచుటకు దారిలేదు. రంధ్రమునకు క్రిందనున్న నీరు లోతు కొలకకందినదికాదు. కోనేరు క్రిందనుండి కొండలోపల భూమార్గ మున నీరామపూరుఘుండి కాశివరకు సొరంగము లున్నవని యచటనున్నవారి నమ్మకము.

ప్రతిదినమును నడిరేయి కాలమున దేవతలు ఋషులు యీ రంధ్రము నుండి వచ్చి యిచటి రామలింగేశ్వరుని పూజించి పోవుచుందురనియు ప్రజా

వాడుకకలదు. వారు మహాత్ములు కావున యీ కోనేటి నీటిమీదుగనే వచ్చి పోవుదురు. వారు మానవుల కంటికి కనపడరు. రామకూరు కొండమీద యీ నాటికిని ఋషులు తపసుచేయుచున్నారనియు వారు బిలమునందుండి రనియు: రాత్రికాలములందీ దేవతలతో కలసి మాటాడుచుందురనియు ప్రతీతి.

స్వర్ణ అమరలింగస్వామి యీ కొండమీద కొన్ని దినములు తపసు చేసిన విషయమందరకును తెలియును. ఆయననే ముప్పవరం అమరలింగ మనియు కొందరందురు. వీరు క్రీ.శ. పందొమ్మిదవ శతాబ్దము వారైనందు నను: వారి లీలలు చూచినవారి వలన చాలవరకు యధార్థమైన చరిత్రయు తెలియుచున్నది. వీరబ్రహ్మేంద్రస్వాములవారును కాలజ్ఞానమున నేను ముప్పవరంలో అమరలింగమునై పుట్టుదుననియు—అటుతరువాత పాలకొల్లు నందు సింహాద్రి విశ్వనాధమునై యవతరించెదననియు తెలిపియున్నారు. అటులనే జరిగింది.

రామకూరు రామలింగేశ్వరస్వామికి ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధ యేకాదశియు—తొలేకాదశి పర్వదినమునను—మాఘ బహుళ త్రయోదశలు (మహాశివరాత్రి పుణ్యకాలము) లందును ప్రత్యేకమునైన అలంకారములు వేసుకలు: గ్రామోత్సవములు జరుగుచున్నవి. దూరస్థలములకు పోలేని పరి పర గ్రామములలోని ప్రజలా పండుగ దినములలో రామకూరువకు వచ్చి స్వాములవారిని సేవించుచున్నారు.

# అమరలింగ స్వామి బాల్యము

గుంటూరు మండలంలోని నరసారావుపేట (తాలూకా)కు రెండుమైళ్ళ దూరము నందున్నది. "రావిపాడు" అనుగ్రామం. అచట విశ్వకర్మ బ్రాహ్మణ దంపతులు—వారింటిపేరు స్వర్ణవారు. వారికి కుమారుడు పుట్టగనే తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు. ఆ పుట్టినవానిపేరు అమరలింగం. అమర లింగంగారి మేనమామ మచ్చా సుబ్బయ్యగారు. ఆరునెలలు నిండకముందె అమ్మా నాన్నల పోగొట్టుకొనిన మేనల్లునా మచ్చా సుబ్బయాచార్యులు తన యింటికి తెచ్చి పెంచాడు. సుబ్బయాచారిగారు నివాసం ముప్పవరం. ముప్ప వరం రావిపాడుకు రెండుమూడుమైళ్ళ దూరములోనే రహదారిమార్గమునంటి యున్నది. అమరలింగంగారి మేనమామ గారింటిలోనే చాలాకాల మున్నం దున ముప్పవరం అమరలింగమనియు చెప్పుటయు కలదు.

అమరయ్యకు వయసు పెరుగుతూ వచ్చింది. ఆయనకు అన్నపు చొరవ దప్ప అక్షరపు చొరవ కలగడంలేదు. కులవృత్తులందే పనియు పట్టు బడలేదు. నలువురిలో మాటాడ నేర్చిన వాడుసుకాదు. ఇంకొకరాయనను పలుకరించినను సరిగ మాటలాడక మౌనముగ నుండువాడు. మేనమామయై పెంచిన కారణమున సుబ్బయాచారి మాత్రమాయన నెటులేని యొక మంచి మర్యాదలుగల మానవునిగ తీర్చిదిద్దాలని తాపత్రయ పడ్డాడు. కాని అల్లుడప్ర యోజకుడని నిర్ణయించుకున్నాక నిరాశచెందక తప్పలేదు. ఐతే ఏ పనీ కల్పించకుండ మనిషిని సోమరిని చేయరాదు కనుక మేనమామ గారాయని

చేత యింటిగేదెలను మేపుటకై నియమించాడు. అంతకన్న అమరయ్య చేయ దగినదియు లేదు. అందరిపుడాయనను "మొద్దమరయ్య" అనసాగారు.

ఒకప్పుడా రాజమార్గమున ముగ్గురు సన్యాసులు ప్రయాణము సేయుచు ముప్పవరం చెంతనొక చెట్టుక్రింద కొంతసేపు కూరుచున్నారు. వారెవరో, యెందుకు వచ్చారో, యెక్కడనుండి యెక్కడకు పోవుచున్నారో యెవరికీ తెలియదు. ఆజానుబాహులు—పొడవైనవారు—జడలుదాల్చిన తలలు విభూతిరేఖలు — రుద్రాక్షమాలలు — దండకమండలాలు-కాషాయాంబరములు చూడ "బ్రహ్మ విష్ణు మహేశ్వరులే యీ రూపాలలో వచ్చియుందురా!" అన్నట్లుగా పురజనులు గుంపులు గుంపులుగా వచ్చి చూచి వారిలోవారే దేవులో అనుకొని తిరిగిపోవుచుండిరేకాని ఒక్కరును వారిని పలుకరింప లేదు. కాని అమరలింగంమాత్రం వారిని విడిచి యీవలకు రాకుండ సాయం త్రందాకా వారిచెంతనే యున్నాడు. అక్కడ వారేమి మాటలాడుకున్నదియు యింకొకరికి తెలియదు.

అప్పటినుండి అమరలింగంలో మార్పువచ్చింది. నానాటికి వానిలో శివభక్తి పెరుగుతూంది. ఆయన మాటాడిన ప్రతి మాటలోనూ యేదో వేదాంతభావం గోచరిస్తూంది. అదేదో యెవరును వివరించి చెప్పలేక పోతు న్నారు. అప్పుడప్పుడు రాముడు కొండమీదికి పోయి రావడం మాత్రం చాలామంది చూచారు. అమరలింగ మా కొండమీది కోనేటిలో స్నానం చేయడం; దేవాలయంలో స్వామి నారాధించడం మొదలైన దృశ్యాలుచూచిన వారు "యీ యనగారికి పిచ్చిలో భక్తి కుదిరిం"దనుకున్నారు.

ముప్పవరం విశ్వబ్రాహ్మణులలో నాటికున్న రమారమి యిరువది కుటుంబముల వారును మచ్చా యింటిపేరు కలిగినవారే. మరొక గృహ నామం కలవారు లేరు. ప్రతి సంవత్సరమును వారు పితృదేవతల కారాధనలు సేయుటాచారం. తద్దినములలో మహేశ్వరులను పూజించి తీరాలి. పితృదేవతారాధన చేయుకర్త తన యింటిపేరిట వారిని భోక్తనుగా నియమింపరాదు. వారా యిబ్బంది వలన తద్దినమునకు రెండుమూడు దినములు ముందుగనే పరిపర గ్రామములకు వార్తలంపి స్వకుల బ్రాహ్మణులను పురోహితులను పిలిపించుకొను చుండెడివారు. పొరుగూరువారు వచ్చినను–రాలేక పోయినను అమరయ్య స్వర్ణకారు కనుక "ముద్దమరయ్య మొదటిభోక్తగా" ముద్రపడి పోయింది.

## తద్దినపు బ్రాహ్మణుడు

ఒకనాడు ప్రక్కయింట తద్దినము వచ్చినది. ఇంటి యజమాని అమరయ్యను భోక్తగా నుండమని చెప్పవచ్చునప్పటికాయన గేదెలను తోలుకొని ఊరుదాటి పోవుచున్నాడు. కర్త వాని వెంటబడిపోయి యూరివెలుపల అమరయ్యను చూచాడు. వినబడనట్లు శీఘ్రగగ గొంతెత్తి "అమరయ్యా! ఈ రోజు మా తండ్రిగారి విధి. నీవు పెందలకడ యింటికి తిరిగి రమ్మ"ని చెప్పాడు. నిజానికా మాటలు అమరయ్యకు వినబడలేదు. ఆయన ధ్యాసలోనే ఆయనుండి యెందుకో చేయి పైకెత్తడం చూచిన యింటి యజమాని

"సరేలే"నని తనకు సమాధానమిచ్చినట్లు భావించుకొని తిరిగి యింటికిపోయి ముందుపనులు చూచుకుంటున్నాడు.

పొరుగూరునుండి రాదగిన బంధువులు వచ్చారు. వంటకములు పూర్తయ్యాయి. స్నానములు చేసి అర్చనదగ్గర కూర్చుండుటకు సిద్ధమయ్యారు. ప్రొద్దువాలిపోయింది. కాని గేదెలను తోలుకొని పోయిన అమరయ్య ఇంకను తిరిగిరాలేదు. భోజనమునకు రమ్మని పిలిచిన వారిని విడిచి భోజనము సేయుట గృహస్థులకు ధర్మము కానందున వారందరును అమరయ్యను వెదకికొనుచుపోయి రామకూరు కొండమీద దేవాలయంలో పద్మాసనంబున కూర్చుండి తపసుచేసుకొను చుండగ చూచారు. కాని గుడితలుపులు వేయబడి యున్నవి.

వారిలో కొందరు పూజారిని పిలుచుకొనివచ్చి గుడితలుపులు తీయించారు. గర్భాలయంలో తపోదీక్షయందున్న అమరయ్యను రావిపాడునుండి వచ్చిన వారి చిన్నాయనగారు వీపుపట్టి లేపారు. మిగిలిన వారంతా పూజారితో "ఏమయ్యా! కోవెలలో మనుష్యులనుపెట్టి తాళములు బిగంచుచుంటివా" యని యడుడగా నా పూజారి "అయ్యలారా! నేను స్వామికి నైవేద్యాదిపనులు నెరవేర్చికొని తలుపులు మూయునపు డిందెవరును లేరు. కంటితో చూచుచునే దేవాలయమున నందింకొకరినుంచి తలుపులు బంధింతునా! తరువాతయీ మహానుభావుండెపుడు గుడిలోనికి వచ్చెనో నేను చెప్పజాలను, కాని యీయన మన మనుకొనినట్లు మొద్దమరయ్యకాదు–మహానుభావుడు. వీరి మహాత్యములు నాకింతకుముందే కొన్ని కనబడుచున్న"వని బదులుచెప్పాడు.

కనులు తెరచి చూచిన అమరయ్య "చిన్నాయనా నీవెందులకు వచ్చావు? నీ కాయువు నేటితో ముగియుచున్నదే!" అన్నాడు. కాని ఆమాట నెవరును లెక్కచేయక "ఇంటియొద్ద తద్దినం నిలిచిపోయింది. పోదాంపద" అని వెంటబెట్టుకొని దిగుచుండగనే అమరయ్యగారి చిన్నాయనగారు ప్రాణములు విడిచారు. బంధువులంతా చనిపోయినవానిని అక్కడనే సమాధిచేసిన తరువాత ముప్పవరం చేరుకున్నారు.

అమరలింగం గారంతటివారితో మీరు నా చెంతకు వచ్చిన సమయంబున కందిమల్లాయ పురములోని వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠంలో నూర్గురు విశ్వబ్రాహ్మణులకు అన్న సంతర్పణం జరుగుచున్నది. వారిభోజనములు పూర్తికావచ్చినవి కాని చివరలో కొంత అంతరాయం జరిగిందన్నారు. ఆమాట లాలకించిన వారిలో కొందరకాలోచనలేర్పడినై. పూజారి చెప్పినట్లు మన యీ యమరయ్య వెనుకటి అమరయ్యకాడు. అందులకు దగినట్లె యీయన చెప్పిన ప్రకారముగ వీరి పినతండ్రిగారు కొండ దిగుచునే మరణించారు. ఇప్పుడీ బ్రహ్మంగారి మఠంలో జరిగే సంతర్పణను గురించియు చెప్పుచున్నారు. ఇదియు నిజమో కాదో తెలిసికొన వలయునను కున్నారు.

ఆనాటి విధివారములు గురుతుంచుకొనిన బంధువులు కందిమల్లాయ పల్లెకు వర్తమానమంపగా అచటి మఠాధిపతులు తిరిగి "నిజమే. మీరడిగిన వాడు—సరిగ్గా అదే సమయంలో నూరుగురుమంది యిచట భోజనములు చేశారు. కాని చిట్టచివరలో మాత్రమేదియో చిన్నియంతరాయం జరిగి

నందున నందరూ లేచి చేతులు కడిగారు. ఐతే ఆ వాంతరమంతగా చెప్పు కొనుటకు దానివలన కలిగిన నష్టమేమియును లే"దని సమాధానమిచ్చారు. అంతటినుండి ప్రజలలో అమరయ్యగారిమీద దృష్టిమారి ఆయనొక దేవు డయ్యాడు.

## బెల్లపుముక్క ప్రసాదము

ప్రతి దిన మమరయ్యగారు స్వాములవారికి నైవేద్యం చెల్లించువేళకా రామకూరు కొండమీది గుడికి పోయి పూజారి నడిగి ప్రసాదమను పేరున బెల్లం అడిగి పెట్టించుకొను చుండెడివారు. ఒకనాడు దేవాలయపు పూజారి యేదో పనిలోనున్నందున "యేమిటమరయ్యా ఇటువచ్చా"వనగా అమరయ్యగారు అమా యకుని వలె నటించుచు "బెల్లపు ముక్క ప్రసాదం పెడతావేమోనని వచ్చా" నన్నాడు. పూజారి కింకా అమరయ్య మొద్దమరయ్య గానే కనపడుచున్నం దున నిరసనగా "బెల్లం ముక్క లేదు. ఏమీలేదు పో"మ్మని కసరుకున్నాడు. అమరలింగ మప్పటికేమీ బదులు చెప్పక "లేకపోతే పోనీలే" అంటూ దారికప్పు కున్నాడు.

మరునాడు పూజారి స్వాములవారికి నైవేద్యం చెల్లించడానికి వచ్చి గుడి తలుపులు తీయనెంత ప్రయత్నించినను రావడంలేదు. ఇంకెలాగయు పని చేయ నందున వానికేమియు తోచక రంధ్రము నుండి లోపలకు చూచాడు.

లోపల స్వాములవారి సన్నిధిలో అమరయ్యగారు కూర్చునియున్నారు. బెల్లపు టచ్చులు వారి చుట్టును పేర్చబడినవి. అవి చూచిన పూజారి తనకన్నులనుతాను నమ్మలేకపోయాడు. తలుపులు బిగించి యుండగ నీత డాలయంబులోని కెట్లు పోయినాడు "ఈబెల్లమెట్లు వచ్చిం"దనే ప్రశ్నలు కలిగినవి. ఐనను స్వామివారి నివేదనా కార్యక్రమం ముందున్నది కనుక "అమర్యయా అమరయ్యా!" అని బిగ్గరగ పిలిచి లోపల గడివైచు కొంటి వేమి! ముందువచ్చి తలుపులు తీయిం స్వామివారికి సేవచేయ వలయు నన్నారు. కూర్చుండిన అమర్యయ్య గారు లేవకయే తలుపులునెట్టు అన్నారు. ఈ సారి పూజారి తలుపుల తట్టినంతనే అవిసులభముగనే తెరువబడినవి.

నైవేద్యముతో స్వాములవారిని సమీపించిన పూజారి కిపుడా బెల్లపు టచ్చులు కనపడలేదు. అమరయ్య మాత్రమచటనే యున్నాడు. పూజారి యంతటనైనను అమరయ్యగారి ప్రభావం తెలిసికొనక "నేను స్వామికి నైవేద్యము చెల్లించునపుడు నీవిందుండరాదు. బయటకు వెళ్ళ"మని వాని నావలకంపి తలుపులు మూసి చూచునంతలో స్వాములవారి లింగం వాని కంటికి కనపడలేదు. అంతట భీయాశ్చర్యములు కలిగిన పూజారి శివలింగ ముండుచోటున చేతులతో తాకిచూచాడు. వానిచేతులకా లింగము స్పష్టముగా తగులుచున్నదేకాని కంటిచూపునకు కనపడడంలేదు. మిగిలిన ఆలయమంతయు కనపడుచునే యున్నది.

పూజారి మనసు పరిపరివిధాల పరుగులెత్తింది; "ఔను తలుపులు బిగించిన యీ దేవాలయంలోనికి అమరయ్య యెట్లు వచ్చాడు? ఇంతకు ముందా యన చుట్టునున్న బెల్లపుటచ్చులు నాకిపుడు కనపడవేమి? చేతికందుచున్న

రామలింగేశ్వరస్వామి కంటి కగుపడకపోవుట కేమి విచిత్రము! ఇదింతయు నీయమరయ్యగారి మహత్యముగాక ఇంకేమి కాగల"దని నిర్ణయించుకొని నందున వెనువెంటనే వెలుపలకువచ్చి అమరయ్యగారిని క్షమాపణ చెప్పుకొని "స్వామీ! నీవు కేవలం దైవాంశ సంభవుండవు గాని సామాన్య మానవుడవు గావు. నీ లీలలు తెలిసికొనలేక పోయినందున నిన్ను చులకనగ మాటాడి సాను. నాయపరాధం మన్నించి లోపలకు దయచేయండి" అని వెంటబెట్టు కొని దేవాలయంబున ప్రవేశించి నంతనే పూజారికి రామలింగేశ్వర లింగం యధా స్థానము నందే దర్శన మిచ్చింది.

అమరయ్యగారిపుడు అమరలింగ స్వామిగా గుర్తింపబడ్డారు. రామ కూడు కొండమీదాయన గారి కిపుడొక ప్రత్యేక గౌరవస్థానం లభించింది. అమరలింగస్వామికా కొండ తావరమయింది. చుట్టు ప్రక్కల గ్రామముల లోని ప్రజలను అమరయ్యను మహిమ గల వానిగా నమ్మి పూజింప సాగారు.

## అమరలింగ స్వామి మహిమలు

స్వామిగా మారిన అమరయ్యగారిపుడా కొండమీదనే యుంటూ వచ్చారు. మేనమామలు కూడ వాని కెటువంటి యాటంకములు కలిగించుట లేదు. స్వామి స్నానమా కోనేరు నందే చేయుచున్నారు. పడకకా దేవా

లయమే యుపయోగపడుతూంది. ఆయన గారికి కావలసిన పాలు పండ్లు మాత్రం సుబ్బయాచారిగారే పంపుతున్నారు. సుబ్బయాచారి గారి కుమారు లలో కొండయ్య యను నాతనికి స్వామిగారి యందు భక్తి విశ్వాసములు కలిగినై. ఒక నాడా కొండయ్య స్వామికి పాలందించాక సాయంత్రందాకా కొండ దిగలేదు. అమరయ్య గారంతట వానితో "ఏమిరాత్రి ఇక్కడనే యుందువటరా!" అనగ కొండయ్య "ఉంటా" నన్నాడు. "ఐతే జాగ్రత్తగ వుండు—భయపడకు" మన్నాడు స్వామి. కొండయ్య తలాడించి వూరు కున్నాడు.

అర్ధమరేయి ప్రొద్దయింది. అప్పటిదాకా కొండయ్య మేలుకున్నాడు. వాని కప్పుడే వో వాద్యములు వినబడినై. కొండయ్య శ్రద్ధగా నాలకించాడే గాని వినబడిన వాద్యము లేవియో చెప్పలేక పోయాడు. మరి కొంతసేపటి కొక వెలుగు కనబడింది. అది పెద్దదయింది. అంత పెద్ద వెలుగును చూడ లేక కనులు మూసుకున్నాడు. అంతే. వానికి నిద్ర పట్టింది. తిరిగాయన నిద్రనుండి మేల్కాంచి చూడనప్పటికి తెల్లవారి ప్రొద్దు పొడిచింది. అప్ప టికే స్వాములవారి స్నానం, సంధ్య, జపములన్నీ పూర్తయ్యాయి. కొండయ్య స్వామి యనుమతి పొంది కొండదిగి యింటికి పోయినాక రాత్రి జరిగినదంతా తోడివానికి చెప్పాడు.

ఆ మాటలు విన్నవారంతా "దేవతలు, ఋషులు నిశీధం వేళ మాన వుల కంటికి కనపడకుండా రామలింగేశ్వర స్వామి దగ్గరకు వచ్చి పోతుంటా రన్నది నిజమై యుండవచ్చును. అమరయ్య నిజమైన దైవాంశ కలిగిన

వాడైనందున దివ్యపురుషులు వానితో సంప్రదింప వచ్చును. మనమా మహాత్ములను చూడజాల"మని అనుకున్నారు.

అమరలింగ స్వామి తరువాత కొన్ని గ్రామములలో సంచారం చేశారు. ఎన్నో మహిమలు చూపారు. వారికి కొంత శిష్యగణ మేర్పడింది. స్వాముల వారొక కాల జ్ఞానమను గ్రంథం వ్రాశారు. ఆ తాళపత్ర గ్రంథం యీనాటికిని ( క్రీ.శ. 1975) ముప్పవరమునందు నాటి సుబ్బయాచారి గారి సంతతి వారింట నున్నది. స్వాముల వారు తొడిగిన పావుకోళ్ళు పసుమూరు గ్రామంబున కొద్దిపాటి అమ్మయ్యలింగం గారింట నున్నవి. ఇంకను అమర లింగ స్వాములు వారు చూపిన మహిమలు; సంచరించిన స్థలములు, జరిగిన సన్నివేశము అనేకము లున్నవి.

స్వాములవారికి యిద్దరు మేనత్తలున్నారు. వారు వితంతువులు. వారును స్వాములవారిచెంతనే యుంటూవచ్చారు. ఒకనాడు వారు నిద్రించు చుండగ స్వాములవారు మేనత్తల మెడలలో యిత్తడి తాళిబొట్లు కట్టారట. మరునాడు వారు కలవరపడి "యిదేమిటి విలయుంరా నాయనా!" అని యడుగ స్వాములవారు వారికి "యికముందు ప్రపంచమేన ముండమోపులు ముత్తయిదువలవుతారు. బంగారపు తాళిబొట్లను బదులు యిత్తడి తాళిబొట్లు వస్తాయి" అని చెప్పారు. శిష్యజన సమేతంగా కొంతకాలం సంచారం చేసిన తరువాత వారు జనసంచారంనుండి దూరంగా పోదలంచుకొని అందరు చూచుచుండగనే గుత్తికొండ బిలంలో ప్రవేశించారు. ఆనాటినుండి

యీనాటి వరకాయనగారు తిరిగి రాలేదు. గుత్తికొండ బిలంలో నేటికిని మహాఋషులు తపసుచేయుచుండిరను జనవాక్యం నిజమని పెద్దలంటున్నారు.

## మార్కండేయు జననము

నాయనలారా: శివలింగ మహిమలు నిరుపమానములు. ఇట్లెన్ని విన్నను తనివిదీరదు. ఇక చెప్పదగినవి—వినదగినవి లేవనజాలము. శివలింగము నారాధించిన మార్కండేయుడు చిరంజీవియై మార్కండేయ ఋషిగా ప్రఖ్యాతిగాంచిన కథయు మనమెరిగిందే.

పూర్వమునందు లోకపూజితులై యున్న మహామునులలో మృకండ మహాముని చాల గొప్పవారు. ఆయనగారి భార్య మరుద్వతీదేవి. ఆ సతీపతులిద్దరూ దైవభక్తి కలవారు. సదాచార సంపన్నులు. అతిథి అభ్యాగతుల నాదరించినవారు. ఐనను వారికి సంతానం లేకపోయింది. ఒకానొక సమయంలో సత్యలోకమందు జరిగిన బ్రహ్మసభలో మునులంతా "మృకండమునికి సంతానం లేనివారికిక్కడ కూర్చుంట నవకాశములేదు పొ"మ్మని నారట. ఆ మాటతో నాముని మరింత కృంగిపోయాడు. కులము నిలుపు కొడుకులేని మన జన్మలెందుకని చింతించిన యా మునిదంపతులు పరమేశ్వరుని గురించి ఘోరంగా తపసుచేశారు.

చాలాకాలం గడిచింది. మృకండముని తపోదీక్ష కానందించిన శంకరుడు సాక్షాత్కరించి "భక్తాగ్రణీ! చలనంలేని నీ భక్తి కానందించాను. నీవు కోరిన వరమిస్తాను. నీకేం కావాలి" అన్నాడు. మృకండముని మహాదేవుని కొనియాడిన తరువాత "వామదేవా! మాకు సంతానభాగ్యం ప్రసాదింపు"మని ప్రార్థించాడు. ఆ మాటలాలకించిన పరమశివుడు "మృకండా! నీకు సంతానము నిచ్చెదను కాని ఒక నిర్ణయమున్నది. గుణవంతుడై తల్లిదండ్రులపేరు నిల్పదగిన కుమారుడు పదునారు సంవత్సరములు మాత్రమే జీవింపగల వాడొక్కడు కావలయునా! లేక—పరమ దుర్మార్గులై లోకాపకారులై వంశమంతకు దుష్కీర్తి దెచ్చునట్టివారు కల్పాంతము వరకును బ్రతికియుండువారు పుత్రులు నూర్వురు కావలయునా!" అన్నారు. మునిదంపతులకిపుడు మంచి గడ్డుసమస్య వచ్చింది. వారాలోచించుకొని "స్వామీ! అల్పాయువు గలవాడైనను యుత్తమ పుత్రునొక్కనినే ప్రసాదించండి" అని వేడుకున్నారు. శివుడు "సరే యిచ్చా"నని యామమైపోయాడు.

తరువాత వారికొక మంచి శుభలగ్నంలో పుత్రుడు ఉదయించాడు. ఆ పుట్టిన బాలునికి మార్కండేయుడని నామకరణం జరిగింది. మార్కండేయుడు పెరిగి పెద్దవుతున్నాడు. సకల విద్యలూ నేర్చాడు. చాల బుద్ధిమంతుడనిపించుకున్నాడు. కన్న తల్లిదండ్రులకే గాక మిగిలిన వారికిగూడ మార్కండేయు డనిన ఆదరాభిమానలు పెరిగినై. ఎటచూచినా వారికెట్టుకు పిలుగని కుమారుని మీద

ఒక రోజు పడినకొలది వాని యాయువు దగ్గరపడుచున్న దనెడి బెంగతో మునిదంపతులు కృంగి కృశించి పోతున్నారు.

## బ్రహ్మదేవు డిచ్చిన దీవెన

ఒకనాడు మృకండ మహాముని యింటికి సప్తఋషులు వచ్చారు. వారి వెంట నారదమునికూడా వున్నాడు. మహనీయుల కా మునిదంపతులు సాంప్రదాయము ననుసరించి కూర్చుండబెట్టి పాదపూజలు గావించిన తరువాత కుమారునిచేత నమస్కారాలు చేయించారు. వశిష్ఠమహాముని ముందుగా మునికుమారుని "చిరంజీవీభవ" అని దీవించాడు. వెంటనే మిగిలిన మునులంతా ఫక్కుమని నవ్వడంతో వశిష్ఠుడు తెల్లబోయి "యేమిటి?" అన్నట్లుగా వారివంక చూశాడు. నారదుడంతట జోక్యం కలిగించుకొని "వశిష్ట మహామునీ! మీరు నవ్విన కారణం నేను మీకు మనవి చేయుచున్నాను. సర్వశాసనకర్తయైన సాంబశివుడీ కుమారునకు పదునారేండ్ల జీవితమునే నియమించి యుండగ మీరీతనిని చిరంజీవిని కమ్మని యాశీర్వదించిరి. అంతకన్న మరేమియులే"దని మిన్నకున్నాడు.

అంచాకా వశిష్ట మహాముని కాయాలోచన కలుగలేదు. ఐతే యిపు డెలాగా చేయడం? మనేది ప్రశ్నయింది. తన నోటిమాట బూటకం కారాదనే తలంపు కలిగించా మునికి. మార్కండేయునకు నిండాయువు

కలిగే యుపాయమేమిటా యన్న యాందోళన మృకండముని కన్న వశిష్టమహాముని కెక్కువయింది. మార్కండేయుని వెంటబెట్టుకొని సరాసరి బ్రహ్మలోకానికి పోయిన వశిష్టుడా బాలునిచేత బ్రహ్మదేవునకు నమస్కారం చేయించాడు. దూరమాలోచించని బ్రహ్మకూడా "దీర్ఘాయుష్మాన్ భవ" అన్నారు. వశిష్టునకు గుండెనిబ్బర మేర్పడింది. అప్పుడు మెల్లగా దగ్గరకుచేరి "పరమేష్ఠీ! ఈ బాలునకు పరమశివుడు పదునారేండ్లాయువు మాత్రమే యిచ్చియున్నాడు. మీరును నావలె పొరపాటుబడి వీనిని దీర్ఘాయుష్మంతునిగా దీవించారు. ఇప్పుడు మన యిద్దరిమాట దక్కేదెలాగా!" అని సలహా యడిగాడు వశిష్టుడు.

బ్రహ్మదేవునికి గూడా యీ విషయం పరిష్కరించడం కష్టమనిపించింది. పరమేశ్వరుని కాదనే ధైర్యం: శక్తి: అధికారాలు లేని మన మాయనను ప్రార్థించే యీ కార్యం సాధించాలని నిర్ణయించాడు. బ్రహ్మ మార్కండేయునకు శివపంచాక్షరీ మహామంత్రోపదేశం చేసి: శివానుగ్రహం పొందుమని దీవించి పంపించాడు. మార్కండేయుడంతట బ్రహ్మ దీవెనలతోబాటు వశిష్టమహాముని దీవెనలుగూడా పొంది యింటికి వచ్చి తల్లిదండ్రుల యనుమతి గైకొని గోమతీ నదీతీరానికి పోయి నివాసమేర్పరచుకొని శివలింగము నారాధించుచున్నాడు.

## మరణములేని మార్కండేయుడు

గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరము చారిత్రకస్థలము పుణ్యస్థలమునై యున్నది. జానార్ధనక్షేత్ర మనబడు కోటిపల్లి-దక్షారామము

ధవళేశ్వరములను మహాక్షేత్రంబులు చుట్టుప్రక్కలందున్నవి. అవి యన్నియు పేరుజెందిన శివక్షేత్రములు. గోమతీనదియు మిగుల పవిత్రమైనది. మార్కండేయుడీ గోదావరీనదీ తీరమున స్నానములు సేయుచు పూలు పత్రి సేకరించుకొనిపోయి శివలింగమును పూజించుచు: అనుక్షణము శివపంచాక్షరీ మహామంత్రమును జపించుచునుండ కొలదిదినములలోనే వానికి శివుడిచ్చిన పదునారు సంవత్సరములు నిండినై.

యమలోకంలో చిత్రగుప్తుడు చిట్టాపుస్తకం తిరగేసి చూచి "యీనాటితో మార్కండేయుని యాయువు పూర్తయిం"దని చెప్పాడు. వెంటనే యమధర్మరాజు తన సేవకులను పిలిచి "మీరిదే భూలోకమునకేగి పోయి మార్కండేయు డెక్కడున్నను సరె— వాని ప్రాణములను తీసికొనిరం"డని యాజ్ఞాపించాడు. యమభటులు సరాసరి గోదావరీ నదీ తీరానికి వచ్చినారు. మార్కండేయుడు శివాలయంలో కూర్చుండి లింగానికభిషేకం చేయుచున్నందున వెలుపలనే నిలువంబడి వానిని వెలుపలకు రమ్మని పిలిచారు. వారు వచ్చిన దెందులకో తెలియును గనుక మార్కండేయు డక్కడనుండియే "నేనిపుడు శివపూజా దీక్షయందున్నాను. వచ్చుటకు వీలులే"దని చెప్పాడు. యమభటులు సాహసించి శివాలయంలో ప్రవేశించబోవు నంతలో భయంకరములైన మంటలు పుట్టి వారిని వెంబడించినై. యమకింకరులు పరుగెత్తిపోయి తమ ప్రభువుతో నీ విషయమంతా చెప్పుకున్నారు.

పరివారం తెలిపినవార్త వినుచునే యమధర్మరాజు హుంకరించి లేచాడు. గదాదండం, పాశం చేతపుచ్చుకొని మహిషవాహనమెక్కి

చరచరా వెళ్ళి గుడిముందు దిగి చూశాడు. దున్నపోతు కాలిగిట్టల చప్పుడు విన్నంతనే భయపడిన మార్కండేయుడు శివలింగాన్ని గట్టిగా కౌగలించుకున్నాడు. అదిచూచిన యముని కన్నులింకా యెఱ్ఱబడినై. మహా కోపంతో పాశం విసరివేశాడు. అది మార్కండేయుని మెడనే కాకుండా లింగానికికూడా చుట్టుకుంది. యముడది గమనించకుండనే గట్టిగా పాశం లాగాడు. మార్కండేయుడు భక్తిపారవశ్యంతో "హరహర మహాదేవ" అన్నాడు. పెళపెళ ధ్వనులు వినపడినై. ఆ ధ్వనికి బ్రహ్మాండం దద్దరిల్లి పోయింది. శివలింగంనుండి శివుడావిర్భవించి యెడమకాలు సాచి తన్నినంతనే యముడు మూర్ఛపడ్డాడు.

ముక్కోటి దేవతలు మునులంతా వచ్చి మహాదేవుని స్తోత్రం చేశారు. పరమేశ్వరా! యముడు లేక యమలోకం పాలించే ప్రభువులేడు. జీవులు చేయు పాపపుణ్యాల పరిశీలన లేకుండా పోతుంది. దయయుంచి యముని బ్రతికించమని వేడుకున్నాడు. శంకరానుగ్రహంతో పడిపోయిన యమ ధర్మరాజు లేచి శంభునికి నమస్కరించాడు. శివుడంతట "ఓయీ! యమా! నేనీ మార్కండేయునకు కల్పాంతముల వరకును జీవించి యుండునట్లు వరమిచ్చుచున్నాను. వీనిజోలికి నీవింక పోవల"దని మందలించాడు. యమధర్మరాజు సరేనని మృకండ నందనునకు వరాలిచ్చి తన పురానికి తిరిగి పోయాడు. శివలింగార్చనాఫల మెట్టిదియో మార్కండేయుని వలన తెలియుచున్నది.

# దక్షిణామూర్తి దర్శనము

స్వాములవారు చెప్పిన యీ విషయములన్నింటిని సాలంకయ్య మొదలైనవారు భక్తిశ్రద్ధలతో విన్నారు. అవకాశము కలిగినపుడెల్లయు స్వాములవారి వలన యిట్టి కథలనే వినుచు దానధర్మములు జేయుచున్నను తన వృత్తివ్యాపారములందెంత మాత్రము నిరసన చూపువాడు కాడు. సాలంకయ్య ఒకనాడాయన తన సోదరులతో గూడి కలప సామగ్రికై యడవిలో తిరుగాడుచుండగ తలవని తలంపుగ మేఘములు కమ్ముకొని ధారాపాతంగ వానకురిసింది. పై చినుకులు తగ్గిందాకా తనవారితోగూడ నొక సురక్షిత స్థానమున నిలిచి తరువాత యింటికి చేరుకొనుచున్న సాలంకయ్యకు లంకెలబిందె దొరికింది.

అంతటితో ఆయన మహా శ్రీమంతుడయ్యాడు. వ్యాపారమింకను వృద్ధిపొందినది. దానికి తగినట్లె ప్రతిదినమాయన చెంతకు యాచకులు రాసాగారు. ఎందరు వచ్చినను సాలంకయ్య వారిని విసిగికొనక—చిన్న పుచ్చక దానధర్మములు సేయుచు చుట్టుప్రక్కలలో మంచి పేరుప్రతిష్టలు గూడ సంపాదించుకున్నాడు. ఐనను వానికి గర్వమేమాత్రమును లేదు. స్వాములవారికిపుడా సాలంకయ్య వెనుకటి కంటెను మించిన సేవకుడయ్యాడు. సాలంకయ్యగారికి స్వాములవారి మాటనిన వేదవాక్యమయింది.

గురువులవారి సూచన శిరసా వహించిన సాలంకయ్య త్రికూటాచలంమీద మారేడువనంలో నూతన దేవాలయమును నిర్మించి దానిలో

దక్షిణామూర్తి యను పేరునొక శివలింగమును ప్రతిష్ఠచేయించారు. ఆలయ పాలనాధికారం వహించిన స్వాములవారంచే నివసింపసాగారు. స్వాముల వారాలయంబునందొక మరియొక గృహమునుండ అంగీకరింపలేదు. అది మొదలు స్వాములవారిని దర్శింపవచ్చు వారలుకూడ నీ దేవాలయముకే వచ్చిపోవుచుండుటాచారమయింది. మరికొంత కాలానికి స్వాములవారి పేరే దక్షిణామూర్తియని ప్రజలు గ్రహించారు.

సనకసనందనాది మునులు; నారద తుంబురులు మొదలైన దేవమునీంద్రులు మానవుల కంటికి కనపడ కుండగనే యిచటి స్వాములవారిని దర్శించి: వినయంబున నమస్కరించి "దేవా! మీరు లోకకల్యాణమునకై యిట్లవతరించిన దక్షిణామూర్త్యంశ సంభవులుగాని మానవమాత్రులు గారు. త్రిమూర్తులు నివసించుచున్న యీ కొండమీదనే మీరును వేంచేసి యుండుట మరింత మహానందం. మాకును యాత్రాస్థలమైనది. సాక్షాత్పరమేశ్వరుండవై దక్షిణామూర్తివిగ వటు రూపము దాల్చియున్న మీ వలన మేము వినదగిన విషయంబులింక ననేకమున్నవి. అందులకై మేమీ క్షేత్రమునకు వచ్చి పోవుచుందుము. దేవరహస్యములను మాకెరింగింపు"మని వేడుకొనుటంజేసి సామరసంబున సనకాద్యాదులకు గురుస్థానము నలంకరించిన దక్షిణామూర్తి స్వామి సంతసించి వారలకు బ్రహ్మోపదేశం చేశారు.

త్రికూటాద్రి యందలి రుద్రశిఖరము మీద బిల్వవనంలో బ్రహ్మాసనంబున దర్శనంబిచ్చుచున్న స్వామియే దక్షిణామూర్తియని దేవతలు దానవులు సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు కింపురుషులంతా సేవించు

మన్నారు. ఈ దక్షిణామూర్తి వటువుగా బ్రహ్మచర్యమందున్న కారణమున యిచటి స్వామికి కల్యాణోత్సవంబులు సేయరాదని నియమించారు–దేవాలయ పాలనాధికార వర్గమువారు.

ఈ రుద్రశిఖరమునే ప్రాతకోటీశ్వరుని చోటనియు సాధారణంగా యనుచున్నారు. ఇందున్న ఆలయం పాతకోటయ్య స్వామిగుడి యనం బడుచున్నది. నిజానికక్కడనున్న స్వామిపేరు దక్షిణామూర్తి ఆ పేరు ప్రజావాడకలో వినబడదు. దక్షిణామూర్తి ప్రాతకోటయ్య గుడినుండి బ్రహ్మశిఖరానికి వచ్చినాక కోటీశ్వరుడుగ ప్రతిష్ట చేయబడినందున నిది కోటీశ్వరక్షేత్రమై కోటప్పకొండగా ప్రజాబాహుల్యంబున వాడుక కెక్కింది. ప్రాతకోటయ్య గుడిలోని దక్షిణామూర్తి స్వామియే యీనాడు నిత్యనైవేద్య దీపధూపసేవలు పొందుచు: మహాశివరాత్రి పుణ్యకాలంబున మహోత్సవములు చేయించుకొనుచున్న యల్లమంద కోటీశ్వర మూర్తి.

పూర్వమొకప్పుడీ శిఖరమున నైరుతి దిక్కునందు దిగువభాగమున బ్రహ్మ తపమాచరించెననియు. అంతట శివుడు ప్రత్యక్షమై చతురాననా! నీ తపసు కానందించాను. నీకేమి కావలయునో కోరుకొనుము. నేనిచ్చెద”అనగ చతురాననుండు పాదాభివందనము లాచరించి “మహేశ్వరా! నా తపోభూమియైన యీ ప్రదేశము నీ కృపచే దివ్యమైన యాత్రాస్థలము కావలయును. నా పేరిచట శాశ్వతముగా నిలిచియుండ వలయుననియే నేను కోరుకొనుచున్న వివరములు”ని ప్రార్థించెననియు: అందు

లకు సమ్మతించిన శివమూర్తి "పితామహా! నీవు నన్నుగురించి తపమాచ రించిన యీ శిఖరము బ్రహ్మశిఖరంబను పేరున పిలువంబడగలదు. ఈ బ్రహ్మశిఖరమున నేను కోటీశ్వరుండనై వేంచేసి యుందును. నీ వభి లషించిన చందంబున నిది మహాక్షేత్రము కాగల"దని వరమిచ్చినట్లొక పురాణకథ తెలియుచున్నది. పరమేశ్వరు డీనాటికిని యీ క్షేత్రమునం దదృశ్యముగా సంచరించుచున్నాడని జనవాక్యముగూడ వినబడుచున్నది. ఆ మహనీయుడు సాలంకయ్య ననుగ్రహించిన స్వామియే ననుటకు సందేహము లేదు. ఇంత మహామహిమా సంపన్నులైన స్వాముల వారికి ప్రథమాలయం నిర్మించిన సాలంకయ్య యెంత ధన్యమూర్తియో చెప్పనలవికావు.

## గొల్లభామ గుడి కథ

కోటప్పకొండకు దక్షిణాంగ కొండకావూరనే గ్రామమున్నది. నందయ్య యనే యాదవుడున్నాడు. వాని భార్యపేరు సుందరి. అన్నవస్త్రా లకు లోటులేని కుటుంబం. వారికుమార్తె ఆనందవల్లి. ఆనందవల్లి చిన్న తనంనుండి మంచి నడవడికగల పిల్ల. పెద్దలన్నా: దేవతలన్నా ఆమె కెంతో భక్తి. పసితనంలోనే శివభక్తి పట్టుబడింది. ఇంటికి వచ్చిన జంగం దేవరలనారాదించేది. రుద్రాక్షమాలలు కోరేది. ఆమె చర్యలుచూచి తల్లిదండ్రులు తమ కుమార్తె బైరాగులలో కలసి పోతుందేమో నని భయ

పడ్డారు. ఆమె మనసు సంసార పక్షానికి మరలించాలని యుక్తవయసు వచ్చి నంతనే వివాహం చేసారు.

ఆనందవల్లి భర్తయు మంచివాడు. ఆమె మనస్తత్వం తెలుసుకొని నందున దైవభక్తి కంతరాయం చెప్పరావను కున్నాడు. ఒక మాఘ మాసంలో తోడి యాడు వారి వెంట కొండ మీదికి పోయి ఓంకార నదిలో స్నానం చేశాక పాత కోటయ్య గుడికి పోయి దక్షిణామూర్తి లింగాన్నారా ధించింది. అమృతవల్లి సమీపము నందున్న స్వాముల వారిని చూచినంతనే ఆమెకు భక్తి కుదిరింది. ఆయనలో పరమశివుడామెకు కనపడ్డాడు. అది మొదలు ప్రతిదిన మామె పాలుతెచ్చి స్వామికిచ్చి తిరిగి పోతూంది. స్వాములవారామె యిచ్చిన పాలుత్రాగి తిరిగి పాత్రనామె చేతికందించువారే కాని వారిరువురి మధ్యా యెటువంటి మాటలు జరుగలేదు.

చైత్ర వైశాఖ మాసాలలో యెండలు తీవ్రరూపం దాల్చినై. చిన్న చిన్న చెట్లు మొక్కలు యెండి పోతున్నవి. నీరు దొరకుట కష్టమయింది. ఆనందవల్లి స్వామికి పాలిచ్చుచునే లింగాభిషేకమునకు క్రిందినుండి నీరు కొండ మీదికి శ్రమపడి మోసికొని పోవుచుండేది. ఒక నాడటులనే నీరు నింపుకొని పోయిన కడవను గుడి ముందుంచి మారేడు దళముల గొని రాపోయింది. ఆమె తిరిగి వచ్చునంతలో కాకియొకటి వచ్చి కడవపై వ్రాలగా కుండి దొరలి నీరంతా నేల పాలయింది. అది చూచిన ఆనందవల్లి "యిక మీదట యీ కొండ మీదకు కాకి రాకూడ"దన్నదట. దానికి నిదర్శ నంగా కోటప్పకొండ మీద కాకులు నేటికిని కనపడవు.

ఆనందవల్లి గర్భవతియైంది. నెలలు నిండుచున్నరోజులు. స్వాములు వారామెతో "అమ్మాయీ! నీవు చాల రోజుల నుండి నాకు పాలు తెచ్చి యిచ్చుచున్నావు. నేను నీకెటువంటి ప్రతి ఫలమును యిచ్చియుండలేదు. ఇపుడు గర్భవతివి. ఇంకను శ్రమపడి యింతదూరము రాలేవు. నీకు నా వలన నేమి కావలయునో అడిగి తీసుకొని యికనింటి వెంటనే యుండుట మంచి" దన్నారు. అందుల కామె వినయంబున "స్వామీ! మీకు నేనీ పానీయాలని సంకల్పం కలిగి యిచ్చుచున్నానే కాని ప్రతిఫల మాసించి కాదు. కాని తమ రనినట్లు నాకిపుడు నెలలు నిండుచున్నవి. ఇంతదూరము కొండెక్కిరావలయు ననిన భారముగనే యున్నది. నాయందు దయయుంచి మీరు కొంచెం క్రిందికి దిగివస్తే బాగుంటుందని కోరుచున్నా"నన్నది.

ఆమె మాటలలోని వినయ విధేయతల కెంతగానో ముచ్చట పడిన స్వాములవారు కాదనలేక పోయారు. "సరేనమ్మా! నీ యిష్టానుసారంగ నేను క్రిందికి దిగి వస్తాను. కాని యెంతవరకు రావలయునో నాకు తెలియదు. నేనెక్కడిదాకా వస్తే నీవు శ్రమపడకుండా రాగలవని నీవనుకొందువో అక్కడకు పోయి నిలబడు. నేను నీ వెనుకగ బయలుదేరి వస్తాను. ఒక విష యం నీవు మరచి పోవద్దు. నేనుకదలివచ్చేటప్పుడు భయంకరమైన ధ్వనులు రావచ్చును. నీవు మాత్రము వెనుకకు తిరిగి చూడకయే పొ"మ్మని చెప్పారు.

ఆనందవల్లి యిపుడు నిజంగానే ఆనందవల్లియైంది. అడిగినంతనే స్వాముల వారంగీకరించి నందున మహానందంతో కొండ దిగి వస్తూంది.

చెప్పినమాట ప్రకారం స్వామియు కదలి రుద్ర శిఖరం నుండి బ్రహ్మ శిఖరం దాకా వచ్చాడు. ఆయన కాలు కదిపినంతనే ప్రారంభమైన ధ్వని మిక్కుటమయింది. కొండ గూడా బ్రద్దలుగ పగిలి పోతున్నదా అన్నంతగ పెద్దదయిన ధ్వనికి భయపడి వెనుకకు తిరిగి చూచింది. అందాకా దిగివచ్చిన స్వామి అక్కడనే నిలబడి "అమ్మాయీ! వెనుకకు తిరిగి చూడవద్దమ్మా! అని చెప్పితిని గద! చూచావు. ఇక నీవక్కడనే-నేనిక్కడనే" నంటూ రాతిలింగంగా మారిపోయాడు. ఆయననే మనమిపుడు యల్లమంద కోటీశ్వరుడని పూజించుచున్నాం.

రుద్ర శిఖరం దగ్గర స్వామి బయలుదేరడం చూచిన సాలంకయ్య వాని సోదరులు గూడ అనుసరించి వచ్చారు. వారు చూచుచుండగనే శిలగ రూపొందిన స్వామికీ బ్రహ్మశిఖరం మీదను ఆలయం. మండపం మొదలైన మందిరము లేర్పడినై. ఆ స్థలమునకు కొంచెం దిగువగ నిలబడిన ఆనందవల్లికి వెంటనే శిశువు పుట్టి మాయమయింది. ఆమెగూడ శిలా ప్రతిమగ నిలిచి పోయింది. ఆమె కాలయం వెలిసి గొల్లభామ గుడయింది. ఆమె యాదవాంగన కనుక ఆనందవల్లికి సంబంధించిన వంశీయులగుట గొల్లభామ గుడిలో ఈనాటికిని యాదవులే పూజారులుగ నున్నారు. సాలంకయ్య తన తమ్ములతో గూడ స్వామి సన్నిధిలోనే లింగాలుగా మారిపోయారు.

యాత్రికులు కోటీశ్వరుని దర్శింప బోవుట ముందుగా నీమెను చూచి నమస్కరించిన తరువాత పైకిపోవు సాంప్రదాయ మిప్పటికిని జరుగుతునే యున్నది.

# ఆలయ నిర్మాణము

నరసరావుపేట జమీందారీ కుటుంబం మొదటి నుండి దైవభక్తిగలదై పేరుగాంచినది. శ్రీరాజా మల్రాజు గుండారావు బహద్దర్ వారును యోగ్యులు దాన ధర్మములు చేయువారు. దైవకార్యములందు వెనుకాడి యెరుంగరు. ఒకనాటి రేయి దక్షిణామూర్తి స్వామి గుండారావు రాజావారి స్వప్నమున కనపడ్డారు. "రాజా! నేనిపుడు రుద్రశిఖరము నుండి దిగివచ్చి బ్రహ్మ శిఖరము మీద లింగరూపమున వెలసి యున్నాను.

నీవు నాకా బ్రహ్మ శిఖరమునందు దేవాలయము నిర్మింపుము. నా క్షేత్రమునందే నిలిచియున్న గొల్లభామ నా భక్తురాలు, ఆమెకును గుడి కావలయును, అదొక గొప్ప శివక్షేత్రము కానున్నది. ఆనందవల్లి గొల్లభామ పేరున జనులచే కీర్తింపబడునున్నది. అటులనే నా కార్తికేయులయిన సాలంకయ్యయు, వాని తమ్ములుగూడ నన్నాశ్రయించుకొని యుండ ననుగ్రహించాను. ఓంకార నదిలో స్నానం చేసి నన్నారాధించి జాగరణముండి మహా శివరాత్రి వ్రతమాచరించిన వారికి నేను శివసాయుజ్య మీయగలను. వారికి సకలైశ్వర్యములు కలుగుట యందనుమానము లేదు. నేను నీకు నియోగించిన యీ పని నీవు పూర్తిగావింపు"మని చెప్పి యదృశ్యమయ్యాడు.

జమీందార్ మేల్కాంచిన తరువాత కలలోని మాటలు తలంచుకొని పొంగిపోయాడు. ఉదయం కొలువ దీరినపుడు పరిమంతా కూర్చుండియుండగా

యీ విషయం చెప్పి "మీ యభిప్రాయమేమిటి!" అని అడిగారు. ప్రభువుల వారి కాత్మీయ లగువారంతా సంతోషించి "మహారాజా! భగవంతుడే స్వయముగ వచ్చి సందేశమిచ్చిన తరువాత సందేహించే దెందుకు? దక్షిణామూర్తి స్వామి యనుమతి ప్రకారం దేవాలయం నిర్మించడమే కావలసిన"దన్నారు. వెంటనే పనివారల నియమించి త్రికూటాచల మందలి బ్రహ్మశిఖరమున నూతన దేవాలయం నిర్మించిన నరసారావుపేట జమీందార్ వారు వేదోక్తముగ దక్షిణామూర్తి స్వామిని కోటేశ్వరుడను పేరుతో ప్రతిష్ట చేసి ధన్యులయ్యారు.

స్వాములవారికి పరివార మేర్పడింది. ఈ క్షేత్రమున జరుగుచున్న నిత్యోత్సవము—మహోత్సవము, సంవత్సరోత్సవములలో సమస్త దేవతలు మునులు మొదలైనవారంతా కోటీశ్వరస్వామిని సన్నిధి యందుందురనునకొక ప్రతీతియు కలదు. సాలంకయ్య లింగమును సాలంకేశ్వరుడని చెప్పుచున్నారు. సాలంకయ్య తమ్ములు నలువురను నాలుగు లింగములైనందున సాలంకయ్యతోనైన యైదులింగములున్న ప్రదేశమిప్పుడు పంచబ్రహ్మస్థానమనియు ప్రఖ్యాతిగాంచింది. రాజా గుండారావుగారే స్వామి దేవాలయమువరకు మెట్లుగూడ కట్టించారు.

కొండనంటియున్న గ్రామము యల్లమంద. ఆ గ్రామము పేరున నీ స్వామిని యల్లమంద కోటీశ్వరుడనుటయు ప్రసిద్ధమై యున్నది. మునులీగ్రామంబున మందలుగనుండి రనియు; ఆకారణంబున పూర్వమీ గ్రామము మునిమందయు — మునిమంద కాలక్రమంబున జనవాడకంలో యల్లమందగా ప్రచారమునకు వచ్చినదనియు ప్రజావాడుక గలదు. ఈ

త్రికూటాచల కోటీశ్వరక్షేత్రము నందింక నెందరో మహనీయులు వెలసి యాత్రికులకు దర్శనము లిచ్చుచున్నారు.

దక్షిణముగ గణనాథ దేవాలయము.

పడమర భాగమునందుత్తరముగ సాలంకేశ్వర—సంతాన కోటీశ్వర లింగములు.

దిగువమెట్ల వరుసప్రక్కగ రామలింగేశ్వరాలయము.

సోపాన మార్గమునకు ముందుగ బొచ్చు కోటయ్యగుడి.

కొండక్రింద ప్రసన్న కోటీశ్వరుడు: నీలకంఠేశ్వరులు వేంచేసి యున్నారు.

విష్ణుశంఖమునందు పాపవినాశన దేవాలయమున్నది. ఆ స్థలమునకు గద్దలబోటని పేరు.

# ఓంకార నదీ ప్రవాహము

త్రికూటాచలక్షేత్రములో ఓంకారనది ప్రవహించుచున్నది. ఓంకార నదీనామము మనకిపుడు ఓగేరునదిగా చెప్పబడుతూంది. ఈ పుణ్యనదీ జలములలో స్నానము లాచరించి తీర్థశ్రార్ధములు చేసినను: దానధర్మ ములు చేసినను మంచి ఫలితములు లభింపగలవు. ఓగేరు ప్రవాహం చేజెర్లచెంత ప్రారంభమగుచున్నది. ఈ చేజెర్ల గ్రామముగూడ గుంటూరు

మండలంలోనిదే. పూర్వమొకానొక కాలంబున దేవతలందరును చేజెర్లయందు వేంచేసియున్న కపోతేశ్వరలింగమును నమక చమక మంత్రములతోను; శివసహస్ర నామములతోను; ఓంకారముతో నభిషేకించినందున కపోత లింగేశ్వరాభిషేక జల మీరూపమున ప్రవహించినదనియు పురాణ ప్రసిద్ధి.

చేజెర్ల కపోతేశ్వరాలయమును గురించిన యితిహాస మొకటి కలదు.

శిబిచక్రవర్తి రాజ్యమేలుతూన్న కాలం. ఆయన చాల ధర్మాత్ముడు. అడిగినవారికి కాదనకుండా దానాలిచ్చిన ధర్మదాత. ప్రాణం పోయినా ఒప్పుకుంటాడుగాని పరువు పోనీయడు. ఆయన ధైర్యసాహసాలను గురించి భూలోకంతోనే కాకుండా దేవలోకం. నాగలోకం. సత్యలోకాలలో గూడ కొనియాడుతున్నారు. ఒక నాడాయన త్యాగశీలాన్ని పరీక్షించాలని పెద్దలంతా అనుకున్నారు.

దేవేంద్రుడు డేగరూపందాల్చి తరుముకొని వచ్చుచుండగ అగ్ని దేవుడు పావురంరూపందాల్చి పరుగు పరుగున వచ్చి శిబిచక్రవర్తి ముందు వ్రాలాడు. శిబిచక్రవర్తి వెంటనే పావురముమీద చేయివైచి "నీ కేమియు భయములేదు. నేనున్నాను నీకేమి కావలయునో చెప్పు" మన్నాడు. మాయా పావురమంతట కపటభయం నటించుతూ "రాజా! ఒకడేగ నన్ను చంపడానికి వెంటాడుచున్నందున ప్రాణభీతిచే వచ్చి నిన్ను శరణుజొచ్చాను. నా ప్రాణములను కాపాడు"మని వేడుకుంది. చక్రవర్తి "దీనికేనా యింతభయం? నీ ప్రాణం కాచేభారం నాది. నీవింక నిర్విచారంగా నా దగ్గరనే యుండు"మని ఆశ్రయమిచ్చాడు. పావురమునకా శిబి చక్రవర్తి.

అంతలో మాయడేగ వచ్చి "ప్రభూ! ఇదియేమి న్యాయము? నాకీ దినమొక వ్రతమున్నది. తినిన నేను పావురపు మాంసమునే తినవలయును—కానియెడల నరమాంసమునైనను దినవచ్చును. కాని నరమాంసము నాకు లభించదు. కావున నాకు దానిపై నాశలేదు. నాకిప్పటికే యాకలి వేయుచున్నది. నేనెంతదూరమునుండియో వెంటాడి తరుముకొని వచ్చిన పావురమును నీవు దాచితివి. నేనిపుడాహారములేక మరణించిన నీకు పుణ్యమా? దయయుంచి నీవిప్పటికేని పావురమును నాకిచ్చి లేచిపోవుటకు సిద్ధముగనున్న నా ప్రాణములను నిలబెట్టు" మన్నది.

శిబి యేమియు మాటాడలేక పోయాడు. ఎవరిని కాదన వీలులేని పరిస్థితి యేర్పడింది. కొంచెంసేపు ఆలోచించిన తరువాత "అయ్యా నేనా పావురమున కింతకుముందే నీకెటువంటి ప్రమాదము రానీయనని అభయమిచ్చియున్నాను. మాటయిచ్చి తప్పుట మా మతంకాదు. నీ వాకటి చిచ్చున వశించుటయు నేనంగీకరింపను. నరమాంస మైనను నీకిష్టమే నంటివి. ఇందులకై నేనింకొకనికి బాధ కలిగింపజాలను. ఎవని ప్రాణ మైనను నా ప్రాణమువంటిదే. కావున పావురమెత్తు మాంసము నా శరీరము నుండియే కోసి యిచ్చెదను. దానిని తిని నీ యాకలి దీర్చుకొను" మని సమాధాన పరచాడు.

డేగ అందులకు సరేనన్నది.

వెంటనే రాజు సేవకులచేత నొక పెద్ద త్రాసు తెప్పించి కట్టించాడు. ఒకప్రక్క పావురమునుంచి రెండవప్రక్క తన శరీరమునుండలి మాంసపు

కండలను కోసి పెట్టుచున్నాడు. యెంత మాంసముంచినను మాయపావు రమునకు సమతూకము కాలేదు. ఇక మేనిమీద మిగిలిన మాంసము లేదనికొనిన తరువాత తానే లేచి త్రాసునందు కూర్చున్నాడు. అప్పుడు తూకం సరిపోయింది. ఆ దృశ్యము చూచినవారంతా "ఏమి! యీ పావుర మింత బరువున్నదా! ఇది యంతయు మాయగా నున్న"దనుకున్నారు.

శిబిచక్రవర్తి యంతట పరమానందమున డేగను పిలిచి "పక్షి రాజా! నా దేహమునందలి మాంసమంతయు తూకమునకు రాకపోయి నందున నీకు నేనిచ్చినమాట దక్కునా? లేదా? అను భయము దోచినది. కాని నాతోకూడ యిపుడు సరిపోయినందున నేనాడినమాట నిలబెట్టుకొన గల్గుచున్నాను. ఇంతకన్న నాకేమియు అవసరములేదు. నన్నుతిని నీ యాకలి తీర్చుకొను"మన్నాడు. వాని త్యాగానికి మెచ్చుకొనిన యింద్రాగ్నిదేవులు వారి నిజరూపములు చూపి "నీ దానశీలము; సత్య వాక్పాలనము; ధైర్యసాహసములు సాటిలేనివి. నీవు చిరకాలము నుహై శ్వర్యములతో నీ రాజ్యము పాలించెదవు. నీ కీర్తి దశదిశల వ్యాపించును. సర్వలోకములలో నీకు గౌరవము లభించును. నిన్ని ప్రజలందరును పూజించెద"రని వరము లిచ్చిన తరువాత తిరిగి పోయారు. అది జరిగిన చాలాకాలానికి శిబిచక్రవర్తియే యీ చేజెర్లయందు తపోకేశ్వరుండై లింగ రూపమున వెలసెనని యిచటి పురాణా ప్రసిద్ధి. మనకిప్పుడది పవిత్ర యాత్రా స్థలమయింది.

# పాపనాశన క్షేత్ర చరిత్ర

విష్ణుశిఖరమందలి పాతగుడికి సమీపంబునున్నదే గద్దలబోటు. దక్ష ప్రజాపతికి నూర్వురు కుమార్తెలు. వారందరిలో పెద్దకుమార్తె సతీదేవి. సతీదేవి పెనిమిటి శివుడు. ఒకానొక సమయంబున బ్రహ్మలోకంలో మునులంతా సభదీరారు. ఆ సభ కధ్యక్షుడు శంకరుడు. దక్షుడందరికన్న తరువాత వచ్చాడు. ఆయనను చూచి మహాసభలోని వారంతా లేచి గౌర వించారు. కాని అగ్రాసనమందున్న శివుడుమాత్రము లేవలేదు. అందుకని దక్షుని కల్లునిమీద కోపం వచ్చింది. "నేను బ్రహ్మదేవుని కుమారుడను— ప్రజాపతిని — పైగా యీ శివునికి పిల్లనిచ్చిన మామను. నన్నుచూచి మీరంతా లేచి నమస్కారాలు చేసినపుడు ఓ బికారి శంకరుడు మర్యాదనీయ కుండ నాయంతవానిని అనుమానిస్తాడా!" అని హుంకరించాడు.

సభలో నున్నవారు కొందరాయనను "మహానుభావా! మీరన్న దంతా నిజమే ఇది మహాసభ. సభకిపుడా మహేశ్వరుడు పెద్ద. అగ్రాస నాధిపతిగ నున్నందున వారిపుడు బాంధవ్య సంబంధములు పెట్టుకొనరాదని మీకు తెలియనిదికాదు. అదిగాక శంభుడనిన యీ ప్రకృతి స్వరూపిణి యైన మహా మాయాస్వరూపుడు. అట్టి లోకాసనకర్త మీకల్లుడైనంత మాత్రమున మిమ్ము చూచి నిలువంబడలేదని మీరనుకొనరా"దని సమాధాన పరుచ ప్రయత్నించారు. కాని మొండిపట్టుదల దక్షదెవరిమాట లాలకింప కుండనే సభనుండి తిరిగిపోయాడు.

పోయినవాడు పోయినట్టులున్నను మోసము వచ్చేదిదికాదు. తానొక మహాయజ్ఞం తలపెట్టి కైలాసానికి తప్ప లోకలోకాలలోని వారందరికి పిలుపు పంపించాడు. దక్షుడుగూడ గొప్పవాడే కనుక వారి యాహ్వాన మందినంతనే సత్యలోకంనుండి బ్రహ్మదేవుడు సరస్వతి మొదలైన వారిని వెంటబెట్టుకు వచ్చాడు. వైకుంఠంనుండి విష్ణువు లక్ష్మిని మన్మధుని ఋషులను వెంటబెట్టుకువచ్చాడు. స్వర్గలోకంనుండి దేవేంద్రుడు శచీదేవిని, జయంతుని, బృహస్పతిని వెంటబెట్టుకువచ్చాడు. అటులనే కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు మొదలైనవారంతా వారివారి బంధువులను మిత్రులను, పరివారాలను వెంటబెట్టుకొని వచ్చారు. దక్షుడందరికీ తగిన మర్యాదలుచేసి యజ్ఞం ప్రారంభం చేసాడు.

కాని వచ్చిన వారిలో సదాశంకరుడు కనపడ నందున విష్ణుబ్రహ్మ యింద్రులు మున్నగువారంతా "ప్రజాపతీ! ఎక్కడెక్కడ నుండు వారమో మేమంతా వచ్చాం. ఇంతకునూ మీ పెద్దల్లుడు మహేశ్వరుడు కనపడడేమిటి!" అని యడిగారు. ఆ మాటలకు దక్షుడు విరగబడినవ్వి "ఆ తెలియక పొరపాటుపడి నేనా ముష్టివానికి పిల్లనిచ్చి మోసపోయాను కాని నాయంతస్తుకు నేనాతనిని నాయల్లుడని చెప్పుకొనదగిన యోగ్యత కల వాడా శంకరుడు? కాకపోయినను యింతవరకు మన్నించుచునే యున్నాను. కాని మొన్న బ్రహ్మసభలో మీరందరాయననే పెద్దనుచేసి కూర్చుండ బెట్టారు. అంతటితో వాని మూడుకన్నులుగూడ మూసుకుపోయి నేను వచ్చినప్పటికిని కనపడకనేమో నన్నుచూచి లేచి నమస్కరించిన వాడుకాడు. నాయంతవానిని చిన్నపుచ్చినందున నేనా మహేశ్వరుడు లేకుండనే యీ

యజ్ఞం చేయదలంచాను. నేనాతనిని పిలువలేదు-వానికిక్కడ స్థానంలే”దన్నాడు ధీమాగా.

ఆ మాటలు విన్నవారంతా బాధపడ్డారు. శివుడు లేని యీ యజ్ఞానికి వచ్చిన మనం తిరిగి పోతే బాగుంటుందనుకున్నారు కాని—యీ దక్షుడసలే పరమ మూర్ఖునివలెనున్నాడు. ఇంకాకా వచ్చిన మనం తిరిగి పోతే మనల శపించునేమో నను భయంబున ఆయనకెదురు చెప్పలేక. వెనుకకు తిరిగి పోలేకా నలకడలోపడి పోయారు చాలామంది. యజ్ఞకార్యం కోలాహలంగా జరుగుతూంది.

ఈ సంగతి కైలాసంలోని సతీదేవికి తెలిసింది. దక్షుడు చేసే యజ్ఞానికి పోదామని భర్తనడిగింది. శంకరుడామెతో నీకది పుట్టినల్లేకాని పిలువనందున పోరాదని మందలించాడు. ఐనా సతీదేవి కన్నవారి మీదుంతు మమకారంకొలది శివుని వేడుకొంది. ఐతే నీవు పోయి రమ్మంటూ వినాయకుని. నందిని. భృంగిని వెంటనిచ్చి పంపించాడు. సతీదేవి వారందరినీ వెంటబెట్టుకొని పోయింది. సతీదేవి రావడం చూచికూడ దక్షునికి భయపడి ఆమె తల్లిగాని, చెల్లెండ్రుగాని యెవరామెను పలుకరించలేదు. చివరకామెయే సాహసించి పోయి దక్షునితో “నాన్నా! సాంబశివుడు లేని సవన మేమిటి? ఇప్పటికైనా మీయల్లుడుగారిని పిలుచుకోనరండి” అన్నది.

దక్షుడంతట నైనను మనసు మార్చుకోక శివుననేక రూపాలుగా నిందించాడు. సతీదేవి తన పతిని నిందించడం వినలేకపోయింది. తిరిగి

కైలాసం పోవడానికి గూడ మొఖంచెల్లక అక్కడనే యోగాగ్నిని ప్రజ్వలింపచేసికొని అందులో కాలిపోయింది. దాక్షాయణీ దగ్ధమైనమాట విని నంతనే శివుడు ప్రళయనాట్యంచేశాడు. ఆయన జటాజూటంనుండి మహా భయంకరమూర్తియైన వీరభద్రుడావిర్భవించాడు. రుద్రుని అనతిపొంది భద్రకాళియు ప్రమథగణంబులను తోడ్కొని పోయిన వీరభద్రుడు దక్ష యజ్ఞాన్ని ధ్వంసంచేశాడు. సభలోనున్న వారిలో చాలామందికి తగిన ప్రతిఫలం జరిగింది. కొందరు పారిపోయారు. దక్షునితల తెగి హోమగుండంలో పడిపోయింది.

ఆ తరువాత దేవతలు. మునులంతా శంకరుని ప్రార్థించారు. వారి ప్రార్థనలను మన్నించిన పరమేశ్వరుడు దక్షునితల నిప్పులలో మసియైపోయింది. కనుక మేకతల అంటించి దక్షుని బ్రతికించాడు. అంతటితో దక్షునికి బుద్ధివచ్చి క్షమాపణ చెప్పుకున్నాడు. అప్పటికి యెటువారటు పోయారు.

## పాపనాశన క్షేత్రములో జలాశయము

భార్యను కోల్పోయిన శివునికి మతిస్థిరం లేకపోయింది. దక్ష యజ్ఞంనాటి కోపమింకా శంకరునిలో మిగిలియున్నదని దేవమునీంద్రులు గుర్తించారు. ముక్కంటి తలచుకొంటె లోకాలన్నీ మాడి మసియైపోతా

యని బ్రహ్మనారాయణాదులకు గూడా తెలుసు. ఏ సమయంలో యేమెటు పోయి యెటువస్తుందోనని పెద్దపెద్దలంతా తహతహలాడుతున్నారు. ఈశ్వరుని కెదురుగా బోయి పలుకరించడానికెవరికిని కాలు ముందుకు పడకంలేదు.

బ్రహ్మదేవుడు చాలావరకాలోచించి విష్ణుశిఖరానికి పోయి పద్మాసనంబున గూర్చుండి శివునిగురించి తపసు చేయబూనాడు. అదిచూచి ముక్కోటి దేవతలుగూడ వారి నివాసములను వీడివచ్చి యీ త్రికూటాచలమందలి విష్ణుశిఖరం మీదనే బ్రహ్మదేవునకు ప్రక్కప్రక్కల సంచరించుచున్నారు. కొంతకాలం జరిగాక సాంబశివుడు బ్రహ్మదేవునికి ప్రత్యక్షమై "ధాతా! నీవు నన్నుగురించి చేసిన యీ తపస్సు నాకానందం కలిగించింది. నీకేమి కావలయునని నన్నింతగా ధ్యానించితివో చెప్పు" మన్నాడు. శంకర సాక్షాత్కారము చూచిన దేవతలు మునులు నారాయణుడు మొదలగువారంతా పరమేశ్వరుని చుట్టూమూగి మ్రొక్కారు. వారందరిని చూచిన శంకరుడు "మీరంతా యెందుకు వచ్చారు: ఏం జరిగింది: మీకు కావలసిన దేమిటి:" అని ప్రశ్నించాడు.

దేవమునీంద్రులంతట "నందివాహనా! నాగాభరణా! ముందు మీరు మమ్ము మన్నింపవలయును. నాడు దక్షయజ్ఞము మీరు లేకుండ జరుగుచున్నదన్న విషయం మాకు తెలియదు. నిజం చెప్పవలయుననిన మీరా యింటికి పెద్దల్లుడుగారైనందున మా యందరికన్నా ముందుగనే వచ్చి యుంటారనియు; మిమ్ములను దర్శింపవచ్చుననిగూడా మేమా దక్షుని యాహ్వానము లందుకొని వచ్చాం. వచ్చిన తరువాత మాకీ రహస్యం తెలి

పింది. మేమంతట తిరిగిపోజూచిన మాటయు బూటకంకాదు. ఐతే ప్రజాపతి సప్పలుగ్రకున్నచున్నారు. మేమింటిమొగం బెట్టినచో దక్షుడు మమ్మే మి శపించునోనను భయంబున మేమా యజ్ఞశాలయందుండక తప్పలేదు.

తరువాత భగవతి సతీదేవి తండ్రిని మండలించినప్పుడా దక్షుడు చేసిన శివనింద క్షమింపరానిది. దాని ఫలితమాతడు వెంటనే యనుభవించాడు. విధి వశంబున యజ్ఞశాలయందున్న మా చెవులందును శివదూషణ పడినది. శివనిందా దోషము మమ్మావరించి యున్నది దానిని మేము భరింపజాలకున్నాము. అంతేకాదు పరమేశ్వరా! ముందు రానున్నది కలి యుగం. నాడు భూలోకంబున నాస్తికవాదులు మిక్కుటముగా నున్నారు అనాడు కొందరు శివనిందలు చేయవచ్చును. ఆ దూషణ లాలకించిన మీ భక్తులను పాపంబుల పాలయ్యేదరు. మాకును. వారికిని శివనింద విన్న మహాపాపము తొలగిపోవు మార్గమెరుంగుటకే మిమ్ము వేడుకొనుచుంటిమి. మమ్ము కరుణించండి" అని పాదాలమీద వ్రాలారు.

శివమూర్తి యంతట చిరునవ్వు నవ్వుతూ "బ్రహ్మ విష్ణు దేవేంద్రాదిముని బృందారమలారా! మీ వేడికోలు నేను మన్నించాను. మీమీద నాకెటువంటి కోపమును లేదు. శివదూషణ చేసినవారికిని. విన్నవారికిని ముక్తికలుగు మార్గమెరిగింపుమనిన మీ కోరికయు నెరవేర్చెద" నని చేత నున్న త్రిశూలంతో నొక చట్రాతిమీద పొడిచినంతనే రాయిపగిలి నీరుబికి యొక జలాశయముగ రూపొందింది.

శంకరమూర్తి దేవమునీంద్రులకా జలాశయమును చూపి "ఇదుగో! ఎవరేగాని నాచే నిర్మింపబడిన యీ జలాశయమున పరిశుభ్రముగ

స్నానముచేసి నన్నారాధించిన వారికి సమస్త పాపములు నశించునట్లు నేననుగ్రహించుచున్నాను. మీరిందు స్నాతులై శివనిందా దోషమునుండి విముక్తులు కండి. ఇందరు దేవతలు, యిందరు మునులు బ్రహ్మనారాయణులుగూడ నన్ను దర్శించిన యీ విష్ణుశిఖరము పాపవినాశన క్షేత్రమను పేరున ప్రసిద్ధినొందగలదు. మరియు నేనిందే లింగరూపమున అవతరించుచున్నాను. ఈ జలాశయమున స్నానములుచేసి నా లింగమును సేవించి భక్తాదులు ధన్యులు కావచ్చునని చెప్పి యదృశ్యుడయ్యాడు. తరువాత పరమేశ్వరుడచట పాపనాశనేశ్వర లింగమై వెలసి యున్నాడు.

# మహాశివరాత్రి వ్రత మహిమ

పూర్వమొక గ్రామమందలి బ్రాహ్మణులందొక పండితుడు నాలుగు వేదాలు; ఆరుశాస్త్రాలు పద్దెనిమిది పురాణాలు చదివి పండిత సభలలో ఘనసన్మానాలు పొందాడు. ఆయన పదిమందిలోను పరువు మర్యాదలు సంపాదించుకొన్న యుత్తమ కుటుంబీకుడు. అదృష్టవశమున నా పండితునకు భార్యయు గుణవంతురాలు లభించింది. ప్రొద్దుననే నిద్రలేచిన వారెవరైనాగాని ఆ పుణ్యదంపతుల పేరొకసారి తలంచుకొనినప్పటికీ వారి పాపాలు పటాపంచలైపోతాయి యనవచ్చు. ఐతే అంత మంచివారికి లేకలేక ఒక సభ్యతలేని కొడుకు కలిగాడు.

కుమారుడు ప్రయోజకుడై పెద్దలపేరు నిలబెడతాడని కలలుగన్నాడా తండ్రి. గారాబంగా పెంచాడు. ఐదవయేట ఉపనయనం చేసి చదువ వేశాడు. ఆయనగూడ శ్రద్ధవహించి కొలదిరోజులలోనే కుమారునికి పంచకావ్యాలు చెప్పించాడు. వానికి వయసు వచ్చాక చెడు స్నేహమలవ డింది. స్నేహప్రభావం వలన విప్రకుమారుడు దుర్వ్యసనాలన్నింటికి లోబడ్డాడు. ఇంట్లో తెలియకుండ పుట్టినచోటునల్లా బాకీలు చేశాడు. అతని నెట్లైనా మంచిదారి పట్టించి బాగుచేయాలని తండ్రి అహర్నిశలూ శ్రమ బడ్డాడు. ఏమాత్రమూ లాభంలేకపోయింది. చివరకా బ్రాహ్మణుని మనసు విరిగిపోయినందున బలవంతంగా పుత్రప్రేమనుగూడా చంపుకుని ఇంటినుండి బయటకు గెంటివేశాడు.

ఇంతవరకు తండ్రిచాటు కొడుకుకు సంపాదనతో పనిలేకపోయింది. ఇప్పుడు స్వతంత్రించి బ్రతకవలసి వచ్చింది. బంధువులెవరూ తమ ఇండ్లకు రానీయడములేదు. ప్రాణస్నేహితులు పలకటంలేదు. చివరకు కడుపు నిండా అన్నంలేక పోయింది. చేసేదిలేక యాచనకు బయలుదేరాడు. దేశాలుపట్టుకు తిరుగుతూ చాలాదూరం పోయాక ఒకగ్రామం చేరుకున్నాడు. అక్కడొక శ్రీమంతుడు శివరాత్రీ వ్రతంచేస్తూ బంధువులనందరినీ పిలిచాడు. వచ్చినవారంతా స్నానాలుచేసి మడిబట్టలుకట్టి విభూతిబొట్లుదిద్ది శివపూజలు చేస్తున్నారు. కాని వ్రతనియమంబు ననుసరించి యుపవాసము లున్నందున భోజనములు సేయుటలేదు. విప్రకుమారున కెటువంటి యుపా హారంకూడా లేనందున వానికాకలి వేయుచున్నది.

దేవతార్చన మండపమునందుంచిన ప్రసాదంమీద వాడిచూపు పడింది. ఎలాగో సమయం చూచుకొని నేర్పుగ పోయి ఆ ప్రసాదం దొంగిలించాడు. కాని యెందులకో వానిలో పరివర్తన కలిగింది. "అమ్మా, నాన్నా చెప్పినమాటలు వినకుండా యిట్టిపనులు చేసినందుకేకదా నేనిల్లు కానిదేశాలకువచ్చి కష్టాలపాలయ్యాను. ఇక్కడున్నవారంతా శివభక్తులు. ఉదయంనుండి యుపవాసం చేశారు. రేయంతా జాగరణ యున్నారు. ఇపుడు కునికిపాట్లు బడడంచూచి నేనిటు రాగలిగాను. దేవునియందున్న దీప మార్పాను. శివప్రసాదం దొంగిలించాను. నేను చేసినదంతా నేరం. నన్ను దైవము మన్నించవలయునంటే నేనీపనులు చేయడం మానుకోవాలి. కష్టపడి బ్రతకడం నేర్చుకోవాలి" అని నిశ్చయించుకొన్నాడు. ఆ వస్తువులనన్నిం టిని అక్కడనేయుంచి తిరిగిపోయాడు,

తిరిగిపోయేవాని కాలు పొరపాటున యింకొకనికి తగిలింది. సగం నిద్రలో నున్న ఆ వ్యక్తి లేచి "దొంగ దొంగ" అని కేకలు పెట్టడంతో ప్రక్కనున్న వారంతా లేచారు. విప్రకుమారు డభిమానపడినందున కనపడ రాదని పరుగెత్తసాగాడు; ఊరు దాటుతుండగ గ్రామ తలారి వానిని వెంబ డించి పట్టుకొనలేకపోయినందున చేతిలోని బల్లెం విసిరివేశాడు. ఆ బల్లెం తగిలిన బ్రాహ్మణయువకుడుచనిపోయాడు; ఆరోజు మాఘబహుళచతుర్దశిలు శివరాత్రి పుణ్యదిన మయింది. ఏవిధముగనైనకానీ చనిపోయిన యువకుడు శివరాత్రినాడంతయు యుపవాసం చేశాడు—జాగరణ ఫలితంకూడా వానికి దక్కింది. శివప్రసాదం చేతులలో తాకినందున వాని పాపములన్నీ హరించి

పోవడమే కాకుండ వానికి శివసాయుజ్యం లభించింది. కైలాసం నుండి దిగివచ్చిన ప్రమధగణంబులు వానిని పూలపల్లకి యందు గూర్చుండబెట్టుకొని శివసన్నిధికి గొనిపోయారు. శంకరుండతనికి మోక్షమిచ్చాడు.

# విప్రాంగన వింత చరిత్ర

పూర్వమొక గ్రామమున నొక బ్రాహ్మణుడున్నాడు. ఆయన జ్యోతిషము నందు అందెవేసినచేయి. రాజ్యాలేలే రాజులకు గూడ జరుగ బోయే విషయాలు చెప్పి గొప్ప పండితుడనిపించుకొని కనకాభిషేకాలు చేయించుకున్నాడు. సామాన్యంగా ప్రశ్నభాగం చెప్తామనేవారెవరు నా బ్రాహ్మణుని యెదుట నిలబడలేరు.

కొంతకాలాని కాయన కొక కుమార్తె కలిగింది. అమ్మాయి జనన కాలం జాగ్రత్తగా తెలుసుకున్నాడు. జాతకం చూచాడు. తల తిరిగిపోయింది. పుట్టిన కుమార్తెకు వివాహమైన ఆరునెలలలోనె వైధవ్యం తప్పదు. ఆతరు వాత నామె జారిణి అవుతుంది. తల్లిదండ్రులేకకాలంలోనే మరణిస్తారు. కడజాతికి యుంపుడుగత్తెగా కులభ్రష్టురాలవుతుంది. తుదకు దిక్కుమాలిన చావుచస్తుంది." అని గణితం చెప్పింది. ఐనా గణితం పొరపాటు పడ్డానేమో నని మళ్ళీమళ్ళీ చూచాడు. ఎన్నిసారులు తిప్పిచూచినా ఆజాతకమంతే. ఆయన కపుడే తల వంపులయింది.

ఏమిటీ చేయడం ;

జననకాల దోషానికి శాంతి యుండక పోదని శాస్త్రిలన్నీ తిరగేశాడు. హోమంలో ఆహుతులు వేసి శాంతి గొప్పగా చేశాడు. ఎంతమందో బ్రాహ్మణులను పిలిపించి యెన్నో దానాలివ్వాడు, అల్లరిచిల్లరవారితో ఆటకాయి తనంగ తిరగనీయకుండా కుమార్తెను కట్టుదిట్టంగా పెంచాడు. ఈడు వచ్చినంతనే చదువు సంస్కారాలు కలవాడు–సాంప్రదాయమున్నవాడు–గుణవంతుడు–ధనవంతుడు-రూపవంతుడునైన యొక స్వశాఖీయ బ్రాహ్మణ వరున కిచ్చి వివాహం చేశాడు. అప్పుడు వివాహక్రియలన్నింటిని వేదాధికారములనుసరించే జరిపించాడు. ఐనప్పటికి ఆరవమాసం వచ్చినంతనే అల్లుడు చనిపోయాడు.

అంతటనైన కుమార్తె తప్పుదారుల పట్టరాదని రామాయణ భారత భాగవతాది గ్రంధముల చదివించాడు, ఆమె చదివిన చదువులో మంచిని వొదిలేసి చెడునే తీసికొనినందున పరపురుషులతో పరిచయం పెంపు చేసుకొంది. గ్రామంలోనివారంతా యింత నీచురాలింకొకర్తె యుండదని చెప్పుకొనడం తల్లిదండ్రుల చెవుల బడింది. తండ్రి యిక ప్రయోజనం లేదని నిశ్చయించుకొని నందున అవమానం భరించలేక గొంతు కురి బిగించుకొని చనిపోయాడు. పెనిమిటి చావు చూచుచునే భార్య భావిలోపడి చనిపోయింది. అంతటితో విషాంగన కడ్డుచెప్పేవారెవరూ లేకపోయారు. మరింత తెగించి చివరకొక కడజాతివానికి మచ్చిక పడింది. వానితోగూడి వానియింటనే కొన్నాళ్ళు కాలం గడపింది కూడను.

ఆమె కంతట పడుచుదనం పోయి ముసలిరూపం వచ్చింది. కుష్ఠ వ్యాధి సంభవించింది. అంతే కాకుండ కన్నులుపోయి గ్రుడ్డిదయింది. అంతకుముందు ప్రేమించి దగ్గరకు తీసిన విటుకాడు నీవునాకక్కరలేదని యింటినుండి వెడలగొట్టాడు. ఏమిచేయడానికి తోచక — ఎటుపోవడానికీ వీలు పడక "కాశీ విశ్వనాధా! నీవే"దిక్కని వారణాసికి పోవ ప్రయాణం గట్టింది. పడుతూలేస్తునే నడక సాగించింది. అప్పటికి శివరాత్రి పుణ్యకాలం గూడ వచ్చింది కనుక యాత్రికులను ధర్మమడుగుతూంది. కాని యెవరా పాపాత్మ రాలి మొరాలకింపలేదు. ఒక కొంటెవాడు మాత్ర మామెచేతిలో మారేడు దళం పెట్టిపోయాడు. గ్రుడ్డిది కనుక ఆమె దానిని చేతులతో పట్టిచూచి యిదియేదో చెట్టాకని పోల్చుకున్నదే కాని మారేడు దళమై యుంటుందని గూడా యూహింపలేదు. దానినావల విసిరి పారవైచింది. ఆ మారేడుదళం సమీపంలోనున్న యొక శివలింగంమీద పడింది. అదిగూడ ఆమెకు తెలియదు. ఇంకొక బారదూరం వెళ్ళకముందే కాలికి రాయితగిలి పడి చనిపోయింది.

చనిపోయిన విషాంగనను యమదూతలువచ్చి తీసుకొనిపోవుచుండగా కైలాసము నుండి వచ్చిన శివకింకరులు "ఆమెను మాకిండు. శివుడు మీరా చనిపోయిన స్త్రీని తీసికొనిరండని మమ్మాజ్ఞాపించినా" డని యడిగారు. యమ భటు లందుల కామోదింపక "యీమె కులటయై చేసిన పాపములు క్షమింప దగినవి కావు. దుర్మార్గురాలు కనుక నరకబాధల ననుభవింపవలసియున్నది. సమవర్తియైన మా యమధర్మరాజావారి యానతిచే మాలోకానికి తీసికొని

పోవుచుంటె మనగ శంకర కింకరులు తిరిగి వారితో "అయ్యా! మీరు చెప్పినదానిలో అబద్ధమేమియును లేదు. ఆమె శివరాత్రి పుణ్యదినమంతయు భోజనము లభింపక యుపవాసమున్నది. నిద్రపట్టక జాగరణ చేసింది. తెలియకపోయినను మారేడు దళము శివలింగము మీద వైచినది. శివలింగమున కతి దగ్గరలో ప్రాణములను బాసినందున నామెకు కైలాసము సిద్ధింపదగినది కావున మీరామెను మాకీయవలయు"నన్నారు.

వారికా వివాదం తీరక సుభటులు యముని చెంతకు పోయారు. యమధర్మరాజు శివదూతలను గౌరవించి విషాంగనను వారికే యిచ్చి మర్యాదలతో కైలాసమున కంపించాడు, కనుక శివరాత్రి ప్రభావము నింతని చెప్పనలవికాదు.

# కోటప్పకొండ ప్రభల వేడుక

శివరాత్రి పండగకు కొన్నిరోజులు ముందుగానే పరిసర గ్రామములలో యీ ప్రభల సందడి ప్రారంభమవుతుంది. గ్రామ పెద్దలు కొందరు పెత్తనం గట్టుకొని చందాలు వసూలు చేస్తారు. లావుపాటివి పొడవైన బొంగులు తెచ్చి ప్రభను నిర్మించుతారు. కొందరు ప్రభలకు రంగుకాగితాలను కత్తిరించి అంటించుతారు. కొందరు గుర్రాలు కట్టి వానిమీద రకరకాల

రంగుబొమ్మల నంటించుతారు. ఇంకా ఖర్చుపెట్టగలవారు ప్రభలకు పూస కూర్పు చేయించి కరెంటు దీపముల నమర్చుతారు.

ప్రభలకై ప్రభ బండ్లని ప్రత్యేకంగ చేయిస్తారు. దాని చక్రాలుగూడ రాతి చక్రాలే కలుపబడుతాయి. అవి సాధారణంగా ఒకగజం యెత్తున చక్కగ చేయబడినవి. ఆ బండిమీద ప్రభను నిలిపి కఱ్ఱలతోను బలమైన తాళ్ళతోను కట్టివేస్తారు. ఆ బండికి మించి బరువు మోయగల యెద్దులను గట్టి లాగిస్తారు. దారిలో యేదైనా యిబ్బంది జరిగితే సవరించడానికి పని వారు పరికరాలతో ఆ బండివెంట నుంటారు. ప్రభముందు దివిటీలు పట్టు తారు—మేళతాళములు వాయించుతారు—బండినడచు నపుడు ప్రభ ప్రక్కలకు వాలకుండ జాగ్రతగ పగ్గములతో పట్టుకొను వారంతా యొక సిబ్బందిగా సమకూడతారు.

ప్రభ కట్టబడిన గ్రామంనుండి కొండకు గల దూరము ననుసరించి వారు తగిన వంటసామాగ్రి మొదలైన వానిని వెంటబెట్టుకొని కొన్నిరోజులు ముందుగనే బయలుదేరి అంచెలంచెలుగా మహాశివరాత్రి నాటికి కోటప్ప కొండను చేరుకొంటారు. శివరాత్రి నాటిరాత్రి యెవరికిని నిద్రలుండవు. క్రిక్కిరిసి యున్న జనసమూహంతోగూడ వారివారి ప్రభల నూరేగింపు చేయిస్తారు. కొందరయితే వారి ప్రభ బండిమీద నొకవేదికగట్టి ఆ వేదిక మీద పాటలు పాడించడం; ఆటలాడించడం మొదలైనవి గూడ చేస్తారు. అటువంటి వేడుకలున్న ప్రభలచెంత ప్రజలు తండోపతండాలుగా మూగు తుంటారు.

శివరాత్రి దాటిన తెలవారుజాముసందే ప్రజలంతా తిరిగి యిండ్ల మొగంపెట్టేటప్పుడే ప్రభలు వెనుకకు తిరిగి మజిలీలు చేసుకుంటూపోయి స్వగ్రామాలకు చేరాక గ్రామోత్సవాలు చేసుకుంటారు. అప్పుడు గ్రామ ప్రజలా ప్రభలముందు నీరుదెచ్చి ధారలుపోసి: కొబ్బరికాయలు సమర్పించుతూ హారతులిస్తారు.

## తిరునాల సందడి

ఈ యేడు మేము కొండకు పోదలంచుకొన్నలేదని భీష్మించి కూర్చున్నవారిలో చాలమంది చివర సమయంలో గుబులు తిరిగి యాత్ర చేయుట కలదు. శివరాత్రికి కొన్నిదినములు ముందుగనే వ్యాపారులాక్షేత్రమునకు బోయి వసరులు చూచుకొని పందిరులు వేసి అంగడులు నిర్మించుకుంటారు. తినుబండారాలు: గృహోపకరణ పరికరాలు, లోహపాత్రలు, రేకు, చెక్క పెట్టెలు, ఆటవస్తువులు, పటాలు, పుస్తకాలు మొదలైన రకరకాల అంగడులలో బజారు లేర్పడి సుందరనగరమై పోయింది.

కాఫీ హోటళ్ళు, భోజనహోటళ్ళు, చెఱకు రసాలు విక్రయించే శాలలుగూడా కావలసినన్ని కనపడతై క్షేత్రమంతటా నూరుబండ్లు నిండియుంటై. చాలమంది యాత్రికులు వారి భోజనాలు, పడకలు, విశ్రాంతి వస

రుల నా బండ్ల దగ్గరనే చేసుకుంటుంటారు. స్నానాలు చేసినా మంచినీరు దెచ్చుకొనినా యిదివరలో శంభులింగం చెఱువొక్కటియే యుండెడిది. కాని యిప్పుడంత శ్రమపడకుండ స్నానాలకు సమీపమునందున్న నీటికాలువ యెంతగానో యుపయోగపడుతున్నది. ప్రభుత్వంవారింతకు ముందునుండియే అక్కడక్కడ నీటిట్యాంకులను నెలకొల్పి ప్రజలకు నీటి సౌకర్యమును కలిగించుచున్నారు. అంతేకాకుండ కొందరు పుణ్యాత్ములు మంచినీటి చలి వేంద్రము నడిపి ప్రతివారికి త్రాగుటకు నీరందించుచున్నారు.

బ్రాహ్మణులు, వైశ్యులేగాక యితరవర్ణములవారును సమారాధనలు చేసి యాత్రికులకు అన్ని సౌకర్యములను కలిగించుచున్నారు. వారిని కోటప్పకొండ అన్నదాన సత్రమువారని అంటారు. ఉదాహరణకు కోటయ్య స్వామి గుడికిపోవు మెట్లెక్కునపుడందరకు కనపడచుండు భవనము విశ్వ బ్రాహ్మణ అన్నదాన సమాజము వారిది. ప్రస్తుతము గుంటూరు పట్టణ వాస్తవ్యులైన పూసపాటి సాంబయాచార్యుల వారు దానికి ప్రధాన కర్తలై ప్రతి సంవత్సరం నిరాటంకముగ నిర్వహించు చున్నారు. అటులనే ఆ క్షేత్ర మునందితర అన్నదాన సత్రములు గూడ క్రమమైన మార్గములతో నడుప బడుచున్నవి.

కొండకెక్కు భక్తాదులు చేరుకో కోటయ్యా! అని అంటుంటారు. కొండమీద ప్రభుత్వం వారిచే నియమింపబడిన పాలనాధికారులు తగిన జాగ్రతలు వహించుచున్నారు. యాత్రికుల కొరకు కొన్ని శాలలు నిర్మించారు. కార్యకర్తలకు ప్రత్యేక కార్యాలయము లున్నవి. కానుకలు వేయు డిబ్బీలమర్చబడినయి. పూజలు మొదలైన వానిని గావించుటకు రుసుములను నిర్ణయించి చీటీ లిచ్చుచున్నారు. స్వాములవారి ప్రసాదము, చిత్రపటములు క్షేత్రపురాణాది గ్రంధములను విక్రయించుచున్నారు.

కొండమీదను కొండక్రింద క్షేత్రమంతటను కరెంటు దీపములు ప్రకాశించుచున్నవి. దొంగతనములు, గలాటలు, కొట్లాటలు జరుగకుండ రక్షక దళముల వారు జాగ్రతగల చర్యల దీసుకొనుచున్నారు. నేరస్థులను పోలీసాధికారులు విచారించి దండించి ప్రజలకు శక్తివంచనలేని సాయమొనర్చుచున్నారు. వారు తప్పిపోయిన పిల్లలను వెదికి వారివారి తల్లిదండ్రులకొప్పగించుట మొదలైన పనులందు వెనుకాడని సేవలు వేయుచున్నారు.

చుట్టుప్రక్కలనుండు బస్తీనగరములనుండి ప్రభుత్వము వారీ పర్వ దినములలో ప్రత్యేకముగ కొన్ని బస్సుల నేర్పరచి తగినకట్టు దిట్టములు సేయుచున్నందున ప్రజలకు ప్రయాణముకూడ సుఖకరమగు చున్నది. తిరునాల సమయము లందేగాక ప్రతిదినము నీ కోటప్పకొండ దగ్గరకు

చిలకలూరిపేటనుండి నరసరావుపేట నుండి ఆర్. టి. సి. వారి బస్సులనేక్వైత కాలములతో నడుపబడు చున్నవి.

ఇంకను యాత్రికులు స్వంత వాహనముల నుపయోగించు కొందురు.

యల్లమంద కోటయ్య కొండొక మహాశివక్షేత్రం.